Despatched on 29.3.65



# నేర్చుకొనుటకు పశితనం ప్రతిబంధకంగాదు

మొక్కలకు అవి బ్రతికే నిమిత్తం నీళ్లు కావలెను అని చిన్న బాలురు పశితనమందే నేర్చుకుందురు. ఈ సామాన్యమైన యదార్థమును ఒక్క మాటు నేర్చుకుంటే ఇంకెన్నటికీ మరువరు.



మీ పిల్లలకు మీరు ఇప్పుడు నేర్పవలసిన మరియొక పాఠము. పళ్లు మరియు పసుచిగుళ్ల పట్ల రోజూ శ్రద్ధవహించుట, అందువల్ల భవిష్యత్తునందు కొన్ని సంవత్సరాలలో దంతక్షయం మరియు పసుచిగుళ్ల జబ్బులబారి బడకుండా వారిని కాపాడినందుకు వారు మీకు అభివందనములర్పింతురు. వారి పళ్లను మరియు పసుచిగుళ్లను ఫోర్‌హన్స్ టూత్ పేస్టుతో తోముకొనుచూ భద్రపరుచుకోమని మీ పిల్లలకు నేడే బోధించండి. దంత వైద్యుని చేత తయారు చేయబడిన ఫోర్‌హన్స్' పసుచిగుళ్లకు గుణకారియైన డాక్టర్ ఫోర్‌హన్ యొక్క ప్రత్యేక పదార్థములు గల టూత్ పేస్టు ప్రపంచంలోకెల్ల ఇది ఒక్కటే. రోజూ వాడుచున్నయడల పళ్లు తెల్లగా మెరయుచూ, పసుచిగుళ్లు గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుండును. "CARE OF THE TEETH AND GUMS" అనే చిన్న రంగుల పుస్తకం ఉచిత ప్రతి కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 10 న.పై. తపాలా బిళ్లలను పంపండి: మేనర్స్' డెంటల్ అడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031, బొంబాయి.




C. I

## COUPON

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ______________________

*Address* ______________________

______________________

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


చందమామ (అన్ని భాషలలో)

( విడి కాపీ **60** పైసాలు )

సాలు చందా రు. **7-20** పైసాలు




1. వి. మల్లారెడ్డి, సలాఖపురము

ఓ మామయ్యా, సినిమాయొక్క పౌరాణిక కథలకునూ, పండితులవారు చెప్పు కథలకును భేద ముండును. కారణము ?

పండితులవారు చెప్పినట్టుగా పౌరాణిక కథలు సినిమాలు తీస్తే అవి అంత రక్తిగా ఉండవు, డబ్బులూ రావు.

2. సి, భక్తవత్సలరావు, కాకినాడ

మీరు ప్రచురించు నెహ్రూ కథ నెహ్రూగారిచే వ్రాయబడిన "ఆటోబయాగ్రఫీ"కి అనువాదమా? లేక మీరు స్వంతంగా వ్రాసినదా ?

ఇంకా ఇతర పుస్తకాలలోని విషయాలు కూడా సేకరిస్తున్నాము.

3. కే. వి. రమణ, విశాఖపట్నం

"చందమామ"లో అచ్చయే ఏ కథలో చూసినా, భాషా, శైలీ ఒకేలా కనబడతాయి. రచయితల్నుండి వచ్చే కథల్ని మీరు సవరిస్తారా ?

రచయితలు పంపే కథలను విధిగా తిరగ రాయవలసి ఉంటుంది. ఒక్కొక్కప్పుడు కథలో చిన్న మార్పులు కూడా అవసరమవుతాయి. పంక్తులు తగ్గించటమూ, పెంచటమూ కూడా అవసరం అవుతుంది.

4. కె. సుందరబాబు, ఏలూరు

రష్యావారు చంద్రమండలానికీ భూమికీ మధ్య ఓ ప్లాట్‌ఫారం లాటిది కట్టినట్టూ, అది గ్రహాల లాగానే భూమి చుట్టూ పరిభ్రమిస్తున్నట్టూ మా మేష్టారు చెప్పారు. దాని గూర్చి కొంచెం చెప్తారా ?

ఇదంతా ఇదివరకే జరిగిందని మీ మాష్టారు చెప్పిఉండరు. ఇతర గ్రహాలకూ, చంద్రుడికి ప్రయాణించే వాళ్ళకు మధ్య దారిలో ఒక కృతిమ ఉపగ్రహం లాటిది ఉండటంలో చాలా సౌకర్యాలున్నాయి. వాటిని ఇక్కడ వివరించటం సాధ్యం కాదు. మీమేస్టారినడిగితే చెబుతారు.

5. కపిల వీరవెంకట లక్ష్మి, కరీమ్‌నగరం

"దుర్గేశనందిని" ఎప్పటికి అవునో తెల్పెదరని నా కోరిక.

రాగల జూలై సంచికతో "దుర్గేశనందిని" పూర్తి అవుతుంది. దాని తరవాత "నవాబు నందిని" వేస్తాం.

ఉగాది

శుభాభివందనములతో



విశాలాంధ్రనంతటినీ
విశేషంగాఆకర్షిస్తున్న
మధురశృంగార
జానపద చిత్రం







డి.వి.ఎస్.
ప్రొడక్షన్స్
వారి

# మంగమ్మ శపథం

దర్శకత్వం: బి.విఠలాచార్య ✦ నిర్మాత: డి.వి.ఎస్.రాజు




రచన: సముద్రాల జూ॥ పాటలు: సి.నారాయణరెడ్డి..కొసరాజు కళ: తోట సంగీతం: టి.వి.రాజు

ఆంధ్ర.పూర్ణా సీడెడ్.ఎస్.వి.డి నైజాం.ఉషా మైసూర్ సదరన్ మూవీస్ నార్త్ ఇండియా వాణీ పిక్చర్స్ చిత్తూరుజిల్లా జ్యోతి పిలిమ్స్(పలమనేరు)




ఎక్కడ
**లైఫ్‌బాయ్** వున్నదో
అక్కడ **ఆరోగ్యము** వున్నది

L. 47-77 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

ఉగాది
అభినందనలు

రేఖా & మురళీ ఆర్ట్స్

# దేవత

దర్శకుడు కె. హేమాంబరధరరావు
నిర్మాత బి. పురుషోత్తం
నిర్వహణ పద్మనాభం
వాణీ రిలీజ్



# రాణీ-వాణీ సంభాషణ

రాణి :—రాబోయే వేసవికి మేమంతా ఊటీకి వెళ్ళ దలచినాము.

వాణి :—యేం! ఎందుకు?

రాణి :—ఎలా భరించటం, ఈ విపరీతమైన ఎండలకు నాకు నా పిల్లలకు చర్మం పెట్లుతుంది. చమటగుల్లలు బాధ భరించలేకుండా వున్నాము.

వాణి :—ఇక యీ వేసవి బాధలకు భయపడ నక్కరలేదు. ఊటీకి బెంగుళూరుకు పోయి డబ్బు ఖర్చుపెట్టవలసిన పనిలేదు. విజయా కెమికల్సు, మద్రాసువారి నూతన తయారీ—అశోకా శాండల్ వుడ్ పౌడర్సు (3 విధములుగా వున్నవి) వాటిని క్రమముగా వుపయోగించిన యీ చమటగుల్లలు (Prickly Heat, Chaffig etc.) చర్మము పెట్లుట—వీటిని దరికి రానివ్వదు. మరియు చర్మమును చల్లగాను మృదువుగాను వుంచును. ఈ పౌడర్సు మైసూరు చందనముతో తయారైనవి.

రాణి :—అలాగా!

వాణి :—అవును. పోయిన వేసవిలో మా కుటుంబమంతా యీ పౌడర్సునే వుపయోగించి చాలా మేలు పొందినాము. ఎచ్చటికీ వెళ్ళలేదు. చాలా డబ్బు ఆదా అయింది.

రాణి :—అలాగా! అయితే మా శ్రీవారితో చెప్పి నేను కూడా తెప్పించుకుంటాను. వీటి పేర్లు చెప్పు.

వాణి :—1. అశోకా శాండల్‌వుడ్ అల్పర్పస్ పౌడర్సు స్నానానంతరం శరీరమంతా చల్లుకోవచ్చును.

2. అశోకా శాండల్‌వుడ్ టాల్కం పౌడర్సు, టాయిలెట్‌గా వుపయోగించునది.

3. అశోకా శాండల్‌వుడ్ ఫేస్ పౌడరు—చక్కటి Plastic Box లో అమర్చబడి వ్యానిటీ బ్యాగ్‌లో వుంచుకుని అప్పుడప్పుడు ముఖమునకు అద్దుకొనుటకు చాలా మంచిది.

విజయా కెమికల్స్ : మద్రాసు - 7

---

అన్నివంటలకు శ్రేష్ఠమైన

## నూనెలు

అగ్‌మార్కు కాబడిన

ఎ.యస్. బ్రాండ్

## చాయపప్పు నూనె




అగ్‌మార్కు కాబడిన

మేన్షన్ బ్రాండ్......

## నువ్వులనూనె




- గోదావరిడెల్టా నువ్వులనుండి ఆరోగ్యకరమగు ప్రత్యేకపద్ధతులతో తయారు కాబడినవి.
- రుచి, రంగు, సువాసనలతో అన్నివంటుపదార్థములను అమితమగురుచివంతముగ చేయును.
- ఊరగాయలను చాలకాలము నిలువయుంచును. ముక్కను మెత్తబడనీయవు, బూజుపట్టనీయవు.
- తలకు వాడినయెడల మెదడుకు చలువ చేయును. వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
- 16, 4, 2. కి.గ్రా. డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

డిస్ట్రిబ్యూటర్సు :

**M/s.** పెరుమాళ్ళు అండ్ కో.
**137,** ఆదియప్పనాయక్ స్ట్రీటు,
మద్రాసు
ఫోను నెం. **23095**

**M/s. B.** వెంకటేశ్వరరావు అండ్ కో.
**136** పురుషవాకం హైరోడ్,
మద్రాసు
ఫోను నెం. **61552**

MFRS, అంబటిసుబ్బన్న & కో. సామర్లకోట



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల ప్రచురించిన "మిత్ర వంచన" అన్న బేతాళ కథకు ఆధారం శ్రీ జి. సంజీవరెడ్డి పంపిన కథ. ఈ కథలో ఈ నాటి పౌరులకు పనికివచ్చే నీతి ఎంతో వున్నది. పరపతీ, పలుకుబడీ గలవారి బంధుత్వాలనూ, పరిచయాలనూ నమ్ముకొని పరభృతాలుగా బతుకుదా మనుకునే వారికి మార్గసింహుడి కథ మంచి గుణపాఠంగా ఉంటుంది. గొప్పవారి ఆశ్రయంతో తన స్థాయికి మించి సుఖాలు పొందా లనుకునే వాడు ముందు ఆత్మ గౌరవం పోగొట్టుకుంటాడు, తరవాత ఆ ఆశ్రయం నిలుపుకునేటందుకు నీచ కార్యాలకు పాల్పడతాడు, నీటి బుడగ లాటి ఆ ఆశ్రయం పోగానే సమూలంగా నాశన మవుతాడు. సుఖ జీవనాన్ని స్వయం కృషితో సాధించుకున్న వాడే ధన్యు డన్నది ఈ కథలోని నీతి.

సంపుటి: 36 - ఏప్రిల్ 1965 - సంచిక: 4

CHITRA



# భారత చరిత్ర




బైరమ్‌ను వదిలించుకున్న తరవాత కూడా రెండేళ్ళపాటు (1560-1562) అక్బరు పూర్తిగా స్వతంత్రుడు కాలేదు.

అతన్ని పెంచిన తల్లీ, ఆమె కొడుకు ఆదమ్‌ఖాన్ అనేవాడూ పెద్ద ఎత్తున అతనిపై పెత్తనం చలాయించారు.

వారి ఔద్ధత్యం చాలా కాలం సహించి చివరకు అక్బరు ఆదమ్‌ఖాన్‌ను చంపించేశాడు. నలభై రోజులపాటు పుత్రశోకంతో కుమిలి కుమిలి అతని తల్లి కూడా చచ్చిపోయింది.

1562 మే నెలలో అక్బరు పూర్తిగా స్వతంత్రుడయాడు.

సామ్రాజ్య నిర్మాణంలో అక్బరు సాటిలేనివాడు. అతను దాదాపు 40 ఏళ్ళపాటు తన రాజ్యాన్ని విస్తరించుకుంటూ వెళ్ళాడు. ఆయన ఒక్కొక్క ప్రాంతాన్నీ ఎలా జయించినదీ తెలుసుకుందాం.

మధ్య పరగణాలలోని ఉత్తర ప్రాంతంలో గరహ్ కటంగ అన్న రాజ్యానికి బీర్ (వీర) నారాయణుడు రాజు. అతను మైనరు. అతని తల్లి దుర్గావతి, రాజ్య భారమంతా మోసేది. ఆమె అసామాన్య రాజపుత్ర సుందరి గానూ, అమిత పరాక్రమవంతురాలు గానూ ప్రసిద్ధి చెందినది.

ఈ రాజ్యం మీదికి 1564 లో అక్బరు ఆసఫ్‌ఖాన్ అనేవాణ్ణి పంపాడు. యుద్ధంలో ఆసఫ్‌ఖాన్ జయించాడు. దుర్గావతి అవమానం కన్న మరణమే మేలని ఎంచి ఆత్మహత్య చేసుకున్నది. బీర్ నారాయణుడు ప్రాణం ఉన్నంతసేపూ పోరాడి చనిపోయాడు. కాలక్రమాన అక్బరు ఈ రాజ్యంలో కొంత భాగం స్వాధీనపరచుకుని మిగిలినది రాజ వంశీయులకు తిరిగి ఇచ్చాడు. అక్బరు తీసుకున్న భాగమే తరవాత భోపాలు రాజ్యమయింది.

**43. అక్బరు రాజ్య విస్తరణ**

ఉత్తరభారతంలో రాజపుత్రుల ప్రాభవం ఇంకా బలంగానే ఉన్నది; భారత చరిత్రలో రాజపుత్ర స్థానం ఇంకా ప్రముఖ పాత్ర నిర్వహిస్తూనే ఉన్నది. రాజపుత్రుల సహకారం లేకుండా తాను సామ్రాజ్యం నిర్మించలేనన్న సంగతి సూక్ష్మబుద్ధి అయిన అక్బరు గ్రహించాడు.

పఠానుల లాగా మొగలులు "గడ్డలో పుట్టినవారు" కారు, పైనుంచి వచ్చినవారు. అందుచేత అక్బరు రాజపుత్రుల సామరస్యం కోసమూ, తన కృషి కంతటికీ వారి సహకారం సంపాదించటానికీ ప్రయత్నించాడు. వివేకమూ, ఔదార్యమూ గల విధానాలు అవలంబించి అతను అనేక మంది రాజపుత్రుల సానుభూతి ఎంతగా చూరగొన్నాడంటే, వారు అతని సామ్రాజ్యం కొరకు అపారమైన సేవ చేసి, తమ రక్తాన్ని కూడా ధారపోశారు. రాజపుత్రుల సేవా శౌర్యాల పైనా, మొగలుల రాజకీయ చతురత పైనా అక్బరు సామ్రాజ్యం నిర్మాణ మయింది.

1562లో అంబరు (జయపూరు) రాజైన రాజా బిహారీమల్లు అక్బరుకు లొంగిపోయి, అతనితో వివాహ సంబంధాలు ఏర్పరుచుకున్నాడు. అయన తన కొడుకైన



భగవాన్‌దాసునూ, మనమడైన మానసింహుణ్ణీ వెంటబెట్టుకుని అగ్రాకు వెళ్ళి, అక్బరు కొలువులో ప్రవేశించి, 5 వేల సేనకు అధిపతి అయాడు. అతని కొడుకూ, మనవడూ కూడా సైనికోద్యోగాలు సంపాదించుకున్నారు.

ఈ విధంగా మొగలు చక్రవర్తులకు నాలుగు తరాలపాటు భారతీయ వీరుల సేవ లభించింది.

కాని మేవారు మాత్రం లొంగి రాలేదు. పై పెచ్చు, మాల్వా నుంచి పారిపోయి శరణార్థిగా వచ్చిన బాజ్ బహదుర్‌కు ఆశ్రయం ఇచ్చింది. మేవార్ స్వతంత్రత

అక్బరుకు కంటకమయింది. అయితే, సంగరాణా అనంతరం అతని కొడుకు ఉదయసింహుడు అసమర్థుడు కావటమూ, మేవారులో అతఃకలహా లేర్పడటమూ అక్బరుకు సహాయకారి అయింది. ఇది మంచి అదనుగా భావించి అతను మేవార్‌పై యుద్ధ యత్నాలు తలపెట్టాడు.

1567 అక్టోబరులో అక్బరు చితోడ్ కోటను ముట్టడించాడు. ఉదయసింహుడు తన దుర్గాన్ని విధికి వదిలేసి తాను కొండల లోకి పారిపోయాడు. కాని అతని పరివారంలో ఉన్న జయమల్లు, పట్టాల వంటి మహా యోధులు నాలుగు మాసాల పాటు—1567 అక్టోబరు 20 లగాయతు, 1568 ఫిబ్రవరి 23 దాకా—అక్బరు బలాలను వీరోచితంగా ప్రతిఘటించారు. చివరకు జయమల్లు అక్బరు పేల్చిన తుపాకి గుండు వాత పడ్డాడు. తరవాత పట్టా కూడా చనిపోయాడు. మిగిలిన వా రందరూ కత్తి పట్టి యుద్ధం చేస్తూ, ఒక్కడైనా మిగల కుండా చనిపోయారు. శత్రువుల చేతిలో పడకుండా రాజపుత్ర స్త్రీలు ఏక చితిలో దూకి దహనమైపోయారు.

తరవాత అక్బరు చితోడ్ దుర్గం ససైన్యంగా ప్రవేసించాడు. చితోడ్ పతనం చూసి హడలెత్తి అనేక మంది రాజపుత్రులు అక్బరుకు పాదాక్రాంతు లయారు. 1569లో రణథంభోర్ రాజు తన దుర్గం తాలూకు తాళపు చెవులను అక్బరు కిచ్చి, అక్బరు కొలువులో చేరాడు. అదే ఏడు కాలింజర్ రాజు కూడా అక్బరు శరణుజొచ్చాడు. కాలింజర్ పతనం మొగలు సామ్రాజ్య విస్తరణలో ఒక ప్రముఖ ఘట్టంగా చరిత్ర కారులు చెబుతారు.

1570 లో బికానేర్, జైసల్మేర్ రాజులు మొగలు చక్రవర్తికి లొంగిపోవడమే గాక, అతనికి తమ కూతుళ్ళ నిచ్చి పెళ్ళి కూడా చేశారు.



# నేహ్రూ కథ

## 10



జవాహర్ 1921లో మొదటిసారిగా జైలుకు వెళ్ళాడు. అప్పటికి అయిదేళ్ళ క్రితమే, 1916 మార్చిలో వసంత పంచమి దినాన, ఢిల్లీలో అతని వివాహం జరిగింది. వధువు కమలా కౌల్. కౌల్ కుటుంబం కాశ్మీరీలు, ఢిల్లీలో స్థిరపడ్డారు. కమల సన్నగా, ఎత్తుగా, సుకుమారంగా ఉండేది.

ఆమె మనస్తత్వమూ, ప్రవృత్తీ కొంత వరకు భర్తను పోలి ఉండేవి. ఆమె భావ సౌకుమార్యమూ, అభిమానమూ, తొందర పాటూ గలది. అపరిచితుల ముందూ, తన కిష్టం లేనివారి ఎదటా బిగుసుకుపోయేది; కాని మిత్రుల తోనూ, ఆత్మీయుల తోనూ చాలా సరదాగా ఉండేది. ఆమె చురుకైనదే గాని, పెద్ద చదువు చదివినది కాదు. ఆమె అభిప్రాయాలు విస్పష్టంగా ఉండేవి; వాటి నామె సూటిగా ప్రకటించేది.

వారిది ప్రేమ వివాహం కాదు, పెద్దలు కుదిర్చిన పెళ్ళి. జవాహర్ తల్లి ఏ విందు సందర్భంలోనో కమల అందచందాలు చూసి, ఆ పిల్లను తన కోడలుగా చేసుకోవాలని నిశ్చయించిందట.

కమల కాపరానికి వచ్చేనాటి కింకా మోతీలాల్ గృహ వాతావరణంలోకి రాజకీయ మారుతాలు ప్రవేశించి, అల్లకల్లోలం జరగలేదు. మరి నాలుగేళ్ళపాటు మోతీలాల్ సార్వభౌముడు లాగా జీవించాడు—రాజభవనం లాంటి ఇల్లూ, అసంఖ్యాకులైన నౌకర్లూ, చాకర్లూ, మోటారుకార్లూ, కుక్కలూ, వాహనాలూ, ఇంటి నిండా మేలైన తివాసీలూ, అమూల్యమైన పింగాణీ, గాజు పాత్ర సామగ్రీ, అశ్వశాలల నిండా గుర్రాలూ, పిల్లలెక్కటానికి పొట్టిగుర్రాలూ, ఆనంద భవనానికి వచ్చే అతిథులూ, పొయ్యే అతిథులూనూ.



వివాహమయే నాటికి జవాహర్ రాజకీయ మానసిక చైతన్యం ఘర్షణలో ఉన్నది. అది తేరుకోవటానికి మరి అయిదేళ్ళు పట్టింది. తొలిసారి జైలుకు పోవటంతో అతని గుంజాటన చాలావరకు సమసిపోయింది, ధర్మ సందేహాలు తొలిగిపోయాయి. ఈ అయిదేళ్ళూ కమల ఏకాంతవాసినే. అతని మనసు ఆ కాలంలో తన వాతావరణాన్నీ, ఆనంద భవనాన్నీ, నవ వధువునూ విస్మరించి ఊహాలోకాలలో విహరించింది; ఇందు కతను తరవాత తరవాత ఎంతో నొచ్చుకుని, బాధపడ్డాడు. కమల మరణానంతర ఇది తీరని సంతాపం అయింది.

ఇద్దరూ కోపిష్ఠివాళ్ళే, తొలి రోజులలో చీటికీ మాటికీ కీచులాడుకునేవారు. ఇద్దరూ వేరు వేరు వాతావరణాలలో పెరిగారు; విద్యా సంస్కృతులలో వారి కేమాత్రం పోలిక లేదు. అందుచేత వారు ఒకరినొకరు అర్థం చేసుకోలేకపోయారు. కమలకు రాజకీయ సూక్ష్మాల మాట అటుంచి, కళ్ళ ఎదుట జరిగే పరిణామాలు కూడా అర్థం కావటం లేదని జవాహర్ చిరాకుపడేవాడు. ఆమె ఆశయం తనకు రాజకీయ సహచారిణి కావటమే నన్న సంగతి జవాహర్‌కు కొంత కాలానికి గాని అర్థం కాలేదు.

దురదృష్టవశాన ఆమె వ్యాధిగ్రస్తురాలై పోయి, ఈ కోరిక తీరే అవకాశం లేనందుకు ఎంతో నిరాశ పొంది ఉండాలి. టాగూరు నాటకంలో చిత్ర ఇలా అంటుంది: "నన్ను దేవత లాగా ఆరాధించ పద్దు; కీటకాన్ని చూసి కాస్సేపు జాలి చెంది, నిర్లక్ష్యంగా పక్కకు నెట్టినట్టు నెట్టనూవద్దు. అపాయ భరితమైన మార్గాన నీ సరస పయనించ నిచ్చి, ఉన్నత ధర్మంలో పాలు పంచుకో నిచ్చినట్టయితేనే నన్ను నిజంగా అర్థం చేసుకోగలుగుతావు."

తన భార్య ఆ చిత్ర లాటిదని జవాహర్ 1930 ఆరంభంలో తెలుసుకోగలిగాడు.

వారి వివాహమైన ఇరవైఒక్క మాసా లకు, 1917 నవంబరులో, వారి ఏక సంతాన మైన పుత్రిక ప్రియదర్శినీ ఇందిర (ఇప్పుడు ఇందిరా గాంధి) పుట్టింది. కుమార్తె పుట్టినది మొదలుకొని కమల ఆరోగ్యం చెడిపోయి, ఒక వ్యాధి తరవాత మరొక వ్యాధితో తీసు కుని, చిట్టచివరకు క్షయ వ్యాధితో జీవితం ముగించింది.

పెళ్ళి అయిన కొద్ది రోజులకే జవాహర్ సకుటుంబంగా కాశ్మీరు వెళ్ళి, వేసవి అక్కడ గడిపాడు. అతను తన కుటుం బాన్ని కాశ్మీరు లోయలో వదిలి, ఒక దాయాదితో సహా పర్వతాలలో సంచరించి, లదఖ్ రోడ్డు వెంట ప్రయాణం చేశాడు. అది టిబెట్టుకు వెళ్ళే దారి. వాళ్ళు ముందుకు వెళుతున్నకొద్దీ దారి నిర్మా నుష్యమైపోయింది. మంచు కొండలూ, హిమానీనదాలూ తగిలాయి. వారు జోజిలా కనుమ దాటినాక, ఎనిమిది మైళ్ళ దూరంలో అమరనాథ గుహ ఉన్నట్టు తెలి సింది. దారిలో బ్రహ్మాండమైన మంచు పర్వతం అడ్డున్నది. అయినా వారు లక్ష్య పెట్టలేదు. ఒక గొర్రెలకాపరిని వెంటబెట్టు కుని కొద్ది మందితోబాటు జవాహర్ ముందుకు సాగాడు. తాడుతో ఒకరి నొకరు కట్టుకుని మంచు మీదుగా ఎక్కసాగారు.



ఎన్నో హిమానీనదాలు దాటారు. అంత ఎత్తున గాలి చాలా పలచగా ఉంటుంది. శ్వాస ఆడదు. అడుగు తీసి అడుగు వెయ్యటం బ్రహ్మప్రళయ మనిపిస్తుంది. ఉదయం నాలుగింటికి బయలుదేరినవాళ్ళు మధ్యాన్నం పన్నెండింటికి ఒక విస్తృత మైన మంచు మైదానాన్ని చేరుకున్నారు. అది చూడటానికి అపురూపంగా ఉన్నది. అర మైలు వెడల్పు గల ఆ మంచు మైదానాన్ని దాటి దాని అవతల కొండ దిగి పోతే అమరనాథ గుహ వస్తుంది. పర్వతం ఎక్కటంతో పోలిస్తే ఇది చాలా తేలిక అనిపిస్తుంది. కాని ఆ మంచు మైదానం నిండా నిలువునెర్రె లున్నాయి. వాటి మీద కొత్తగా పడిన మెత్తని మంచున్నది. ఇలాటి మంచుపైన అడుగు పెట్టి జవాహర్ దిగుపకు పడిపోయాడు. అది ఒక అహోబిలం లాటి అగాథం. అతని నడుముకు కట్టి ఉన్న తాడు తెగకపోవటం చేత అతని కానాడు గండం తప్పింది. లేకపోతే అతని జాడ తెలియటానికి కొన్ని యుగాలు పట్టి వుండును. ఇంత జరిగినా జవాహర్ వెనక్కు తిరగక ముందుకే పోతానని పట్టు బట్టాడు. కాని ముందుకు వెళ్ళిన కొద్దీ అగాధాలు ఎక్కువయాయి. అందుచేత వారందరూ నిరాశ చెంది వెనక్కు తిరగ వలిసి వచ్చింది.

కాశ్మీరుకు మళ్ళీ వెళ్ళాలనీ, మానస సరోవరమూ, కైలాస శిఖరమూ చూడాలనీ జవాహర్ కలలు కన్నాడు. అందుకుగాను అతను అనుకున్న ఏర్పాట్లు ఏవీ కొనసాగలేదు. రాజకీయ వ్యవహారాలు అతని కార్యక్రమాన్ని నిర్ణయించి, అతని చేత కాశ్మీరు యాత్రలకు బదులు జైలు యాత్రలు చేయించాయి. భారత ప్రధాని అయినాకనే అతను మళ్ళీ కాశ్మీరు లోయనూ, మంచు కొండలనూ సందర్శించి, లదఖ్ కూడా వెళ్ళగలిగాడు.






## 11

[విమల జగతసింహుడికి రాసిన ఉత్తరంలో తాను ఏ విధంగా అభిరామస్వామి వల్ల ఒక శూద్ర స్త్రీకి జన్మించినదీ, వీరేంద్రసింహుడు తనను ప్రేమించి కూడా పెళ్ళాడటానికి ఎలా సంకోచించినదీ, మానసింహ మహారాజు అతన్ని ఏ విధంగా పెళ్ళికి బలాత్కరించి వీరేంద్రసింహుడికి శత్రు వైపోయినదీ, తాను వీరేంద్రసింహుడి భార్య అయి ఉండి కూడా ఎలా దాసిగా మసులుకున్నదీ తెలిపింది. ఈ సమయంలోనే జగతసింహుడు విమలా తిలోత్తమలు నవాబు అధీనంలో ఉన్నట్టు దిగజుడి వల్ల తెలుసుకుని క్షోభపడ్డాడు.]

ఆ రాత్రి జగతసింహుడు నిద్రపోలేదు. తనకు సర్వస్వమూ అయిన తిలోత్తమ నవాబు విలాస భవనంలో చేరి, నవాబు ఉంపుడుగత్తెలలో ఒకతెగా ఉంటున్నది. ఇప్పుడామె జీవించి ఉండి మాత్రం ఏం ప్రయోజనం? ఇంతకన్న తిలోత్తమ చనిపోయి ఉండినా బాగుండేదే నను కున్నాడు జగతసింహుడు.

ఇలా విచార సాగరంలో కొట్టు మిట్టాడుతూ ఎప్పుడు కన్ను మూశాడో అతనికే తెలియదు. మర్నాడు ఉదయం ఉస్మాన్ ఖాన్ అతన్ని నిద్రలేపి, అతని చేతిలో ఒక ఉత్తరం పెట్టి, "రాజకుమారా, ఈ ఉత్తరాన్ని నీకు అందజేస్తానని అది రాసిన మనిషికి మాట ఇచ్చాను. దీన్ని తీరికగా చదువుకో. మూడు జాముల వేళ

బంకించంద్ర చట్టోపాధ్యాయ




నేను మళ్ళీ వస్తాను. దీనికి జవా బేమైనా రాసేటట్టయితే అందజేయగలను," అని చెప్పి వెళ్ళిపోయాడు.

తన మనోవైకల్యం కాస్త తగ్గాక జగతసింహుడా ఉత్తరాన్ని మొదటి నుంచి చివరదాకా చదివాడు. అది విమల రాసిన ఉత్తరం. సాంతం చదివి అతనా ఉత్తరాన్ని తగలబెట్టి బూడిద చేశాడు. ఉత్తరమైతే తగలబడి బూడిద అయిందిగాని, అతని మనస్సులో ప్రజ్వలించే ఆలోచనలు మాత్రం బూడిద అయేలాగా కనబడలేదు.

చెప్పిన ప్రకారం మూడుజాముల వేళ ఉస్మాన్ జగతసింహుడి వద్దకు వచ్చాడు; "ఉత్తరానికి జవా బేమన్నా పంపుతావా?" అని అడిగాడు.

అదివరకే రాసి ఉంచిన జవాబును జగతసింహుడు ఉస్మాన్ చేతి కిచ్చాడు.

ఉస్మాన్ ఉత్తరం విప్పి చూస్తే అందులో రెండేరెండు ముక్క లున్నాయి: "అభాగ్యురాలా, నీవు చేసిన మేలు మరవను. నీవు నిజంగా పతివ్రతవే అయితే, నీ భర్త వెళ్ళిన మార్గాన్నే శీఘ్రంగా అనుసరించు—జగతసింహుడు."

ఉస్మాన్ ఈ రెండు ముక్కలూ చదివి, "యువరాజా, నీ హృదయం చాలా కర్కశమైనది," అన్నాడు.

యువరాజు నీరసంగా, "పఠానుల కంటేనా?" అన్నాడు.

ఉస్మాన్ కర్కశంగా, "అందుకేనేమో పఠానులు నీ యోగ క్షేమాలలో లోపం చేసింది?" అన్నాడు.

జగతసింహుడు సిగ్గుపడుతూ, "లేదు బాబూ, నేను నా విషయం చెప్పలేదు. మీరు ఎంతో దయగా నాకు క్షేమం కలిగించారు. ఖైదీనైనప్పటికీ నాకు ప్రాణ దానం చేశారు. గర్భశత్రువుకు ఎంతో సహాయపడ్డారు. నేను ఖైదీనే అయితే నాకు మీ దయా శృంఖలాలు వద్దు, నిజమైన సంకెళ్ళే



వెయ్యండి. నేను ఖైదీని కాకపోతే నన్నీ బంగారు పంజరంలో ఎందుకు బంధించి ఉంచారో చెప్పండి," అన్నాడు.

"యువరాజా, కష్టాలను పిలిచి ఆహ్వానిస్తా వెందుకు ? వాటంతట అవే వస్తాయి," అన్నాడు ఉస్మాన్.

"హంసతూలికాతల్పం పైన కాకుండా రాళ్ళ పైన పడుకోవటం కష్టాలలో జమ అని రాజపుత్రుడు భావించడు. కతలూ ఖాన్‌కు తగిన శిక్ష ఇవ్వజాలని పక్షంలో మరణం కూడా నాకు కష్ట మనిపించదు," అన్నాడు జగతసింహుడు.

"యువరాజా, జాగ్రత్త! పఠానులు అన్నంతా చేస్తారు !"

జగతసింహుడు నవ్వి, "సేనాపతీ, నన్ను భయపెట్టటం మీ తరం కాదు," అన్నాడు. ఉస్మాన్‌కు అసలు సంగతి స్ఫురణకు వచ్చింది. అతను జగతసింహుడితో, "నేను మరొక ముఖ్యమైన పని మీద ఇక్కడికి వచ్చాను," అన్నాడు.

జగతసింహు డాశ్చర్యపడి, "ఏమిటది? చెప్పండి!" అన్నాడు.

"నేను చెప్పబోయే విషయం నవాబు తరఫునే నని గుర్తుంచుకో !"

"మంచిది."



"విను. యుద్ధం మూలంగా రాజపుత్రులూ, పఠానులూ కూడా నాశనమై పోతున్నారు."

"పఠానులను నాశనం చెయ్యాలనే మా ఉద్దేశ్యం."

"అది నిజమే. కాని రెండు పక్షాలూ నాశనం కావటమే గాని ఏదో ఒక పక్షం మటుకే నాశనమయే అవకాశం కనిపించదు. మందారణ దుర్గాన్ని జయించిన వాళ్ళు బొత్తిగా బలహీనులని నీకు తోస్తున్నదా ?"

"లేదు. వాళ్ళు సమర్థులే."

"ఏమైనా, మా గొప్ప చెప్పుకోవటం నా ఉద్దేశం కాదు. మొగలు పాదుషాతో




శాశ్వత వైరం పెట్టుకుని పఠానులు ఒరిస్సాలో ఒదిగి ఉండటంలో సుఖ మేమీ లేదు. అయితే పాదుషా పఠానులను తన అధీనంలో ఉంచుకో గలగడం కూడా సాధ్యమయేది కాదు; ఢిల్లీకీ ఒరిస్సాకూ ఎంత దూరమో నీకు తెలుసు. అంత దూరం నుంచి పాదుషా ఒరిస్సా నెలా జయిస్తాడు? ఒకవేళ జయించినా బోలెడంత సేన నష్టం కావటమే తప్ప ఒరిస్సా పాదుషా అధీనంలో ఉండదు. ఇలా ఉభయ పక్షాలూ నాశనం అవుతూ పోవటం వల్ల లాభ మేమిటో నీవే ఆలోచించు," అన్నాడు ఉస్మాన్.

"అయితే ఏం చేస్తామంటారు?" అని జగతసింహు డడిగాడు.

"నేను స్వయంగా ఏమీ అనటంలేదు. సంధి చేసుకుంటామని మా నవాబు అంటున్నారు."

"ఎలాటి సంధి?"

"ఉభయ పక్షాలూ కొంత త్యాగ బుద్ధి చూపాలి. కతలూ ఖాన్ బెంగాలులో తాను గెలుచుకున్న ప్రాంతాలన్నిటినీ విడిచిపుచ్చ టానికి సిద్ధం. పాదుషా మా పైకి పంపిన సేన లన్నిటినీ ఉపసంహరించుకుని, ముందు కూడా మా పైకి రాకుండా ఉండాలి. ఇందువల్ల నష్టం పఠానులకే గాని, పాదుషాకు కాదు. ఏమంటే, మేము ఎంతో శ్రమపడి గెలుచుకున్న దంతా వదులుకుంటున్నాం. అక్బరు పాదుషా తాను గెలవని దాన్ని మాత్రమే పోగొట్టు కుంటారు."

"సరే, ఇదంతా నాతో ఎందుకు చెబు తున్నారు? సంధి విగ్రహాలు చెయ్య సమర్థుడు మానసింహ మహారాజు. ఆయన వద్దకే సంధి రాయబారం పంపండి."

"దూతను పంపాం. అయితే ఆయన కెవరో నిన్ను పఠానులు హత్య చేసినట్టు వార్త చెప్పారట. ఆయన పుత్ర శోకంతో

కుమిలిపోతున్నారు; సంధి ప్రస్తావన విని పించుకునేటట్టులేరు. రాయబారి చెప్పినా ఆయనకు నమ్మకం కలగలేదు. నీవే వెళ్ళి, మా పక్షాన మాట్లాడితే పని జరగవచ్చు."

జగతసింహుడు ఉస్మాన్ కేసి చూసి, "నా దస్తూరీ చూసినా మహారాజుకు నమ్మకం కలుగుతుంది గదా, నన్ను స్వయంగా ఎందుకు పొమ్మంటున్నారు? అసలు సంగతి చెప్పండి," అన్నాడు.

"మహారాజుకు ఇక్కడి వాస్తవ పరిస్థితి తెలియదు. అదీగాక, ఆయనకు నిన్ను చూస్తే కలిగే తృప్తి నీ ఉత్తరం చూస్తే కలగదు. ముందు నీకు బంధవిముక్తి ఒకటి కలుగుతుంది. ఇవన్నీ ఆలోచించి నవాబీ ఆలోచన చేశారు."

"నాన్నగారి దగ్గిరికి వెళ్ళటానికి నాకేమీ అభ్యంతరం లేదు."

"చాలా సంతోషం. మరొక్క మనవి. సంధి కుదరని పక్షంలో నీ విక్కడికి తిరిగి వచ్చెయ్యవలిసి ఉంటుంది. అలా మాకు మాట ఇవ్వాలి."

"మాట ఇచ్చి నిలబెట్టుకుంటానని నమ్మక మేమిటి?"

ఉస్మాన్ నవ్వి, "రాజపుత్రులు ఆడి తప్పరని అందరికీ తెలుసు," అన్నాడు.



"నాన్నగారిని కలుసుకుని సాధ్యమైనంత త్వరగా తిరిగి వస్తానని మాట ఇస్తున్నాను," అన్నాడు జగతసింహుడు.

"మేము చెప్పే సంధి నిబంధనలకు మహారాజు ఒప్పుకునే లాగా సాధ్యమైనంత కృషి చేస్తానని కూడా మాట ఇవ్వు."

"అలా మాట ఇవ్వలేను. పఠానులను ఓడించి విజయం సాధించమని పాదుషా మమ్మల్ని పంపారు. మేం విజయం పొందగలం. పఠానులతో సంధి చేసుకోవటానికి పాదుషా మమ్మల్ని పంపలేదు. సంధి చేసుకోవటానికిగాని, మానటానికిగాని మాకు హక్కు లేదు."




ఉస్మాన్ ముఖాన సంతోష విషాదాలు రెండూ తాండవించాయి. అతను జగత సింహుడితో, "యువరాజా, రాజపుత్రుడ వనిపించే లాగా మాట్లాడావు. కాని కాస్త ఆలోచించుకో, నీ విముక్తికింతకన్న మంచి ఉపాయం దొరకదు," అన్నాడు.

"నేను విముక్తుణ్ణి కాకపోతే పాదుషాకు దిగులా? ఇంకెందరో నా లాటి రాజపుత్రు లున్నారు!"

ఉస్మాన్ బాధపడుతున్నట్టుగా జగత సింహుణ్ణి మరీ మరీ బతిమాలాడు. కాని జగతసింహుడు అతను కోరినట్టు మాట ఇవ్వలేదు.

"నేను చెప్పిన దానికి ఒప్పుకోకపోతే నవాబు ఏం చేసేదీ చెప్పలేం," అన్నాడు ఉస్మాన్.

"నన్ను ఖైదులో పెట్టించమని నేను ముందే అన్నాను," అన్నాడు జగత సింహుడు.

"అంతటితో నవాబు తృప్తిపడతారని ఏమిటి?"

"వీరేంద్రసింహుణ్ణి చంపించినట్టు నన్నూ చంపించవచ్చు. అంతకంటె ఏం చెయ్యగలరు?" అన్నాడు యువరాజు.

ఉస్మాన్ విచారంగా, "అయితే ఇక నేను సెలవు పుచ్చుకుంటాను," అని చెప్పి వెళ్ళిపోయాడు.

మరికొంత సేపటికి జగతసింహుడి వద్దకు ఒక సైనికాధికారి వచ్చాడు. అతని వెంట మరి నలుగురు ఖడ్గహస్తులైన సైనికు లున్నారు. వారిని చూసి జగతసింహుడు, "మీరంతా ఏం పని మీద వచ్చారు?" అని అడిగాడు.

"మిమ్మల్ని మరొక చోటికి తీసుకు పోవటానికి," అని వారు జవాబు చెప్పారు.

"నేను సిద్ధంగానే ఉన్నాను, పదండి," అంటూ జగతసింహుడు వారి వెంట బయలుదేరాడు...



ఆ రోజు నవాబు జన్మదినోత్సవం. ఉదయం నుంచీ ఎక్కడ చూసినా ఒకటే కోలాహలం; ఒక చోట నృత్యం, మరొక చోట తాగుడు, ఇంకోచోట దానధర్మాలు, వేరొకచోట భోజనసంతర్పణ; ఇలాగే రోజంతా గడిచి రాత్రి అయింది.

విమల భవన మంతా కలయతిరిగి, ఎలా గైతేనేం తిలోత్తమ పడుకుని ఉన్న గదికి చేరుకున్నది. అమె, "నేను వచ్చాను," అనగానే తిలోత్తమ లేచి కూర్చున్నది. తిలోత్తమ మాటా, పలుకూ లేకుండా ఆమె కేసి తేరిపార చూసింది.



"వస్తానన్నాను, వచ్చాను. ఏం మాట్లా డవు?" అన్నది విమల.

"ఏం మాట్లాడను? మాట్లాడే దంతా అయిపోయింది," అన్నది తిలోత్తమ. ఆమె కంఠ ధ్వని చూస్తే అంతకుముందుదాకా ఆమె ఏడుస్తూ ఉన్నట్టున్నది.

"ఇలా అహోరాత్రాలు ఏడుస్తూ ఎంత కాలం బతుకుతావు?" అన్నది విమల.

"బతక్కపోతే ఏమిటి నష్టం? ఇంత కాలం ఎందుకు బతికానా అనే నా విచారం," అన్నది తిలోత్తమ.

విమల కూడా కన్నీరు వచ్చింది. ఆమె కళ్ళు తుడుచుకుని, దీర్ఘంగా నిట్టూర్చి, "తీరిక లేకా, మన విచారం కొంత తగ్గ గలందులకూ కతలూ ఖాన్ ఇంతవరకూ మన కేసి చూడలేదు. ఇవాళ మనం కనబడకపోతే ఏం చేస్తాడో తెలియదు," అన్నది. తిలోత్తమ వణికిపోతూ, "మరో మార్గం లేకపోతే చచ్చిపోగలను," అన్నది.

"అలా నిరాశపడి లాభంలేదు, తిలోత్తమా. కాస్త ధైర్యం వహించు. ఇక్కడి నుంచి తప్పించుకు పారిపోయే ఉపాయం నా చేతిలో ఉన్నది," అంటూ విమల తన దుస్తులలో నుంచి జిగేలున మెరిసే కత్తినీ, ఉస్మాన్ ఇచ్చిన వుంగరాన్నీ పైకి తీసి తిలోత్తమకు చూపింది.



"ఈ కత్తి ఎక్కడ నుంచి వచ్చింది?"

"నిన్న అస్మానీ వచ్చింది చూశావుగా? అభిరామస్వామి దాని ద్వారా ఈ కత్తి పంపారు."

"ఈ ఉంగరం?"

"నేను తప్పించుకు పోగలందులకు ఉస్మాన్ ఈ ఉంగరా న్నిచ్చాడు."

తిలోత్తమ స్తభించి పోయింది. ఆమె గుండె దడదడలాడుతున్నది.

"ఈ మాసిన గుడ్డలు విడిచి, మంచి బట్టలు వేసుకుని, నృత్య గానాలు జరిగే చోటికి బయలుదేరు," అన్నది విమల.

"ఊహు!" అన్నది తిలోత్తమ.

"అయితే నువు బయటపడలేవు."

తిలోత్తమ ఏడవసాగింది.

"అలా దుఃఖించకు! మనసు నిబ్బరం చేసుకుని నేను చెప్పినట్టు చెయ్యి. నిన్ను కాపాడడానికి నే నొక ఉపాయం చేశాను," అన్నది విమల.

ఆ మాట వింటూనే తిలోత్తమ విమల కేసి కోపంగా చూసింది.

"ఈ ఉంగరాన్ని తీసుకుని నీ వద్ద ఉంచుకో. నువు వినోద స్థలానికి వెళ్ళ నవసరం లేదు. అర్థరాత్రి దాకా సంబరం సాగుతూనే ఉంటుంది. అర్థరాత్రి సమయాన ఉంగరంతో అంతఃపుర ద్వారానికి వెళ్ళు. అక్కడ నీ కొక సిపాయి కని పిస్తాడు. వాడు నీ కిలాటి ఉంగరమే చూపించినట్టయితే దీన్ని వాడికి చూపించు. అప్పుడు వాడు నిన్ను అభిరామస్వామి దగ్గిరికి తీసుకుపోతాడు, లేదా నువ్వెక్కడికి పోతానంటే అక్కడికి తీసుకుపోతాడు. నువు నిర్భయంగా వాడి వెంట వెళ్ళవచ్చు. మధ్య దారిలో ఇతర పహరావాళ్ళు నిన్ను నిలిపినా, ఈ ఉంగరం చూపిస్తే నిన్ను అడ్డగించరు. తెలిసిందా?" అన్నది విమల. ఈ మాట చెప్పి విమల వెళ్ళిపోయింది.

—(ఇంకా వుంది)






# మిత్ర వంచన

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, ఏ మోసగాడి మెప్పు కోసం నీ వీ విధంగా శ్రమ పడు తున్నావో నాకు తెలీదు. కాని మార్గసింహుడి లాగా వంచన పొందకుండా చూసుకో. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకా మార్గసింహుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

చతురగిరి రాజుకు చిత్రసేను డనే ఒక కుమారు డుండేవాడు. చిత్రసేనుడికి చిన్న తనంలోనే ఒక వేటగాడి కొడుకుతో స్నేహ మయింది. వాడి పేరు మార్గసింహుడు. వారు ఒకరి నొకరు విడవకుండా కలిసి తిరిగే వాళ్ళు. యుక్తవయసు రాగానే చిత్ర సేనుడికి రాజ్యాభిషేకం చేసి అతని తండ్రి వానప్రస్థం వెళ్ళిపోయాడు.

## బేతాళ కథలు




రాజైపోవటంతో చిత్రసేనుడి జీవిత విధాన మంతా మారిపోయింది. ఇప్పు డతనికి మార్గసింహుడి వంటి వాళ్ళ సహవాసంతో పనిలేదు.

అయితే మార్గసింహుడు మాత్రం తమ పాత స్నేహాన్ని మరవలేదు. తన చిన్ననాటి స్నేహితు డిప్పుడు రాజయాడు గనక తన కిక ఏ లోటూ ఉండదని వా డను కున్నాడు. ఆ ధైర్యంతోనే వాడు తన జీవితాన్ని తీర్చి దిద్దుకోలేదు, తన కులవృత్తిలో దక్షత సంపాదించుకోలేదు: తన తండ్రి కూడబెట్టినది కాస్తో కూస్తో యథేచ్ఛగా ఖర్చు పెట్టేసి, బికారి అయాడు.

పూట గడవని స్థితి ఏర్పడిన మీదట మార్గసింహుడు రాజును చూసి సహాయం అడుగుదామని సభామంటపం వద్దకు వెళ్ళి వేచి ఉన్నాడు. కొంత సేపటికి రాజు సభకు వచ్చాడు, మార్గసింహుణ్ణి చూశాడు, కాని గుర్తించనట్టుగానే లోపలికి వెళ్ళిపోయాడు. ఇలా రెండు మూడు రోజులు రాజు తనను చూసి కూడా పలకరించక పోయేసరికి మార్గసింహుడికి నిరాశ కలిగింది. తనకూ రాజుగారికీ ఉండిన బాల్య స్నేహం తన కేమీ ఉపకరించదని వాడు రూఢి చేసుకున్నాడు.

తోటి కులం వాళ్ళు మార్గసింహుడి వద్దకు వచ్చి, "వేటగాడు తిండికి మాడవలిసిన గతేమిటి? ఇవాళ మే మంతా వేటకు పోతున్నాం. మా వెంట అడవికి రా!" అని పిలిచారు. మార్గసింహుడు తన తండ్రి వేట పరికరాలు తీసుకుని వేటకు బయలుదేరి వెళ్ళాడు.

అడవిలో మిగిలిన వాళ్ళంతా అనేక రకాల జంతువులను పట్టుకున్నారు. మార్గసింహుడికి చిన్న కుందేలు పిల్ల అయినా చిక్కలేదు. వాడికి వేట బొత్తిగా రాదు.

సూర్యాస్తమయం వేళ వేటగాళ్ళు ఎవరు కొట్టిన మృగాలను వాళ్ళు తీసుకుని ఇళ్ళకు

తిరిగి పోయేటప్పుడు మార్గసింహుడికి వాళ్ళతో కలవటానికి సిగ్గు వేసింది. వాడు ఒంటరిగా ఒక కాలి బాట వెంబడి నడుస్తూ పోసాగాడు.

అలా కొంత దూరం వెళ్ళేసరికి మార్గ సింహుడి కొక గుహ కనిపించింది. గుహ లోకి వాడు తొంగి చూడగా, ఒక అందమైన యువతి కూర్చుని ఉన్నది. ఆమె తొడపైన తల పెట్టుకుని ఒక మునీశ్వరుడు నిద్ర పోతున్నాడు. అటువంటి చోట అంత అంద మైన స్త్రీ ఉండటం చూసి నిర్ఘాంతపోయి మార్గసింహు డక్కడే నిలబడి ఆమెను కన్నార్పకుండా చూడసాగాడు. అది గమ నించి ఆమె, ముని లేస్తే ప్రమాదమనీ వెళ్ళిపొమ్మనీ అతనికి సైగ చేసింది.

మార్గసింహుడు భయపడి అక్కడి నుంచి కదిలి నడుస్తూ, అంత అందమైన స్త్రీ తన బాల్య మిత్రుడైన చిత్రసేనుడికి భార్యగా ఉండదగినదనీ, ఈమె సమా చారం అతనికి తెలిపినట్టయితే తమ పూర్వ స్నేహం మళ్ళీ మొగ్గ తొడిగి పది కాలాల పాటు ఫలితాలనిస్తుందనీ ఆలోచన చేశాడు.

వాడు తిన్నగా రాజభవనానికి వెళ్ళి, రాజుగారికి అతి ముఖ్యమైన రహస్యం ఒకటి చెప్పటానికి వచ్చానని కబురు చేశాడు. వెంటనే రాజుగారి దర్శనం లభించింది.





అమెను ఎత్తుకు రావాలన్న కోరిక ఉంటే అందుకు ఇదే మంచి సమయం," అని చెప్పాడు మార్గసింహుడు.

చిత్రసేనుడి కా స్త్రీని కాజెయ్యాలని బుద్ధి పుట్టింది. అతను వెంటనే మంచి దుస్తులు ధరించి, రెండు గుర్రాలను తెప్పించి, ఒక దాని మీద తానెక్కి, రెండో దానిపైన మార్గసింహుణ్ణి ఎక్కమని, మార్గ సింహుడి వెనకగా, అడవిలో గుహ ఉన్న ప్రాంతానికి వెళ్ళాడు.

గుహకు కొంత దూరంలో ఇద్దరూ గుర్రాలు దిగారు.

చిత్రసేనుడు తన స్నేహితుడితో, "నీవు గుహ లోకి తొంగిచూసి, మునీశ్వరు డింకా నిద్రపోతూనే ఉన్నాడేమో చూడు. నిద్రపో తుంటే ఆ ముని తల నీ తొడ పైకి మార్చు కుని ఆ స్త్రీని నా వద్దకు పంపు. తరవాత నేను వచ్చి మునిని చంపి నిన్ను విడి పిస్తాను," అన్నాడు.

మార్గసింహుడు గుహలోకి పిల్లి లాగా ప్రవేసించాడు. ముని ఇంకా ఆ స్త్రీ తొడ పైన తల పెట్టుకుని అలాగే నిద్రపో తున్నాడు. మార్గసింహుడు ఆ స్త్రీని సమీ పించి చెవిలో రహస్యంగా, "నిన్ను ఈ ముని బారి నుంచి తప్పించటానికి

మార్గసింహుణ్ణి చూసి రాజు, "మనం కలుసుకుని చాలా కాలమయింది. నిన్ను నేను మరిచాననుకోకు. కాని రాజరికం ఒక పంజరం లాంటిది. వెనక ఉండిన స్వేచ్ఛ నా కిప్పుడు లేదు. ఇంతకూ నీవు చెప్ప వచ్చిన రహస్యం ఏమిటి?" అన్నాడు.

"అరణ్యంలో ఒక గుహలో ఒక అపూర్వ సుందరిని చూశాను. ఆమె దేవ కాంత అనుకోవలిసిందే గాని మానవ కాంత కాదు. ఆమె వెంట ఒక మునీశ్వరుడున్నాడు. ఆ స్త్రీ ఇలాటి అంతఃపురంలో ఉండదగినది గాని, ముని వద్ద గుహలో ఉండదగినది కాదు. మునీశ్వరుడు నిద్రలో ఉన్నాడు.

చిత్రసేనమహారాజు వచ్చాడు. ఆయన నవ మన్మథుడు. ఈ ముని తల నా తొడ మీదికి మార్చి, నువు వెళ్ళి మహారాజును కలుసుకో," అన్నాడు.

వెంటనే ఆ స్త్రీ అమితోత్సాహంతో ముని తలను భద్రంగా ఎత్తి మార్గసింహుడి తొడకు మార్చి, నిర్బంధంలో నుంచి బయట పడిన పక్షి లాగా బయటికి పారిపోయింది. చిత్రసేను డామె అందం చూసి నిర్ఘాంత పోయాడు; ఆమె అత నూహించిన దాని కన్న చాలా రెట్లు అందంగా ఉన్నది. అత నామెను తన గుర్రం మీద ఎక్కించుకుని నగరానికి తిరిగి వెళ్ళిపోయాడు.

రాజు వచ్చి మునిని చంపి తనను విడిపిస్తాడని మార్గసింహుడు ఎంతో సేపు చూసి, తనను తన బాల్య మిత్రుడు వంచన చేశాడని గ్రహించి, కంట తడి పెట్టుకోసాగాడు. అతని కన్నీటి చుక్కలు మీద పడి ముని నిద్రలేచి కూర్చుని, ఆడ దానికి మారుగా ఎవడో మగవా డుండటం చూసి, "ఎవరు నువు? ఆ స్త్రీ ఏమయింది?" అని అడిగాడు.

మార్గసింహుడు దొరికిపోయిన దొంగ లాగా బెదురుతూ, ఆ మునికి జరిగినదంతా పూస గుచ్చినట్లు చెప్పేశాడు. అంతా విని ఆ ముని, "దుర్మార్గుడా, పాపిష్టివాడా! ఈ పని చేసి



నందుకు వెంటనే చచ్చిపో!" అని శపించాడు. ఆ క్షణంలోనే మార్గసింహుడు ప్రాణాలు విడిచాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. తన వద్ద ఉండే స్త్రీని తీసుకు పోయిన వాడూ, మిత్రద్రోహీ అయిన చిత్రసేనుణ్ణి శపించక, తన కోసం ఎవడో అందగాడు వచ్చాడనగానే మునిని వదిలి పారిపోయిన స్త్రీనీ శపించక, గోరుచుట్టపైన రోకటి పోటు లాగా, హతాశుడై ఉన్న మార్గసింహుణ్ణి ముని ఎందుకు శపించాడు? దాచకుండా ఉన్న మాట చెప్పినందుకైనా వాడి పైన ఆ ముని ఎందుకు జాలి తలవలేదు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు కృతఘ్నుడే, కాని లోకంలో ఉన్న దుష్టులను శిక్షించడం ముని పని కాదు. అందమైన స్త్రీలను సంగ్రహించడం రాజులకు స్వాభావికం. అందుచేత ముని రాజును శపించలేదు. ఇక, ఆ స్త్రీ అందం గురించి ముని కేమీ వ్యామోహం లేదు. ఆమెకు తన శుశ్రూష ఇష్టం లేక రాజాంతఃపురాల ఉండాలని ఉన్నట్టయితే అది ఆమె దురదృష్టం. అందు కామెను శిక్షించడం అనవసరం. పోతే, గొప్పవాడి స్నేహం కోసం మార్గసింహుడు నీచమైన పని చేశాడు. ముందు ముందు ఇంకా నీచమైన పనులకు ఒడిగట్టుతాడు. అంతే గాక వాడు ఏనాడో జీవచ్ఛవమైపోయాడు. వాడే విధంగానూ బతకలేకనే ఎండమావి లాటి రాజాదరాన్ని వాంఛించాడు. అందుచేత చావు వాడికి విమోచనమే గాని, శిక్ష కాదు," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)

[జి. సంజీవరెడ్డి కథ ఆధారంగా]





# తరనిపగ

మలయ పరిసర ప్రాంతంలో మారదేవు డనే ఒక ఐంద్రజాలికు డుండేవాడు. అత నికి అనేక మంత్ర విద్యలు తెలుసు. కాని అతను వాటిని ధనార్జనకు వినియోగించక, బీదవాడు గానే ఉంటూ వచ్చాడు. మార దేవుడికి లవుడనే కొడుకుండే వాడు. వాడికి తండ్రి తన విద్యలన్నీ నేర్పించాడు.

తండ్రి లాగా కాక లవుడికి తన విద్య లతో ధనమూ, కీర్తీ గడించాలని తృష్ణ కలి గింది. అందుచేత వాడు స్వగ్రామం విడిచి దేశాల వెంబడి బయలుదేరాడు. అనేక మంది రాజులు వాడి ఇంద్రజాల విద్యను చూసి, మెచ్చుకుని మంచి బహుమానా లిచ్చారు. ఇలా దేశాటన చేస్తూ లవుడు తోరణ దేశానికి వచ్చాడు. అతను అక్కడి రాజు వద్దకు వెళ్ళి, తాను ఐంద్రజాలికు ణ్ణనీ, తన విద్యతో అనేకమంది రాజులను మెప్పించాననీ, రాజుగారి అనుమతి అయితే ఇక్కడ కూడా ప్రదర్శన ఇస్తాననీ విజ్ఞాపన చేసుకున్నాడు.

తోరణదేశపు రాజుకు లేక లేక ఒక ఏడాది క్రితమే ఒక మగపిల్లవాడు కలిగాడు. ఆ పిల్లవాడి జాతకం చూసిన జ్యోతిష్కులు, రెండో ఏట ఆ పిల్లవాడికి ఒక ఐంద్రజాలి కుడి మూలాన హీన యోగం కలుగుతుందని చెప్పారు. అదిమొదలు రాజుకు ఇంద్రజాల మన్నా, ఐంద్రజాలికు లన్నా సింహ స్వప్నంగా ఉంటున్నది.

ఇప్పుడు లవుడు వచ్చి తాను ఐంద్ర జాలికుణ్ణని చెప్పగానే రాజుకు దడ పుట్టు కొచ్చింది. తన కొడుకు భద్రసేనుడికి రెండో ఏడు ప్రవేశించగానే ఈ ఐంద్ర జాలికు డెక్కడినుంచో ఊడిపడ్డాడు! వీడి వల్ల తన కొడుక్కు ఏదో కీడున్నది!

రాజిలా అనుకుని మంత్రితో రహస్యంగా మాట్లాడి, ఎలాగైనా ఈ ఐంద్రజాలికుణ్ణి

ఎ. సత్యనారాయణ




ఎంత రహస్యంగా జరిగినప్పటికీ ఈ దారుణ హత్య గురించి వార్త పొక్కనే పొక్కింది. కొద్ది మాసాలలో అది మారదేవుడి దాకా వెళ్ళింది. తన కొడుకును హత్య చేశా రన్న మాట నిజమో కాదో తెలుసుకునే టందు కతను స్వయంగా బయలుదేరి, తోరణ దేశానికి చేరుకున్నాడు. లవుడు తోరణకు వచ్చినట్టు తెలిసిన వా రున్నారు, కాని వాడు అక్కడి నుంచి ఎటు వెళ్ళాడో, ఏమయాడో చెప్పినవారు లేరు. లవుణ్ణి దివాణానికి అతిథిగా పిలిచి చంపించారన్న వార్త నగరంలో చాలామంది విని ఉన్నారు.

మారదేవుడు స్వతః చాలా మంచివాడు. కాని, ఏకారణమూ లేకుండా రాజు తన కొడుకును చంపించాడని విన్న మీదట అతనిలో పగ రగిలింది. అతను రాజ భవనం ప్రాంతంలోనే సంచరిస్తూ రాజ కుమారుణ్ణి దాసీలు వనవిహారానికి తీసుకు వచ్చినప్పుడు తన విద్యలతో ఆ దాసీలను ఏమార్చి, కనుకట్టు చేసి, రాజకుమారుణ్ణి ఎత్తుకుని తన దేశానికి తిరిగి వెళ్ళి పోయాడు. అతను ఇంటికి చేరుకుని, రాజ కుమారుడి దుస్తులూ, ఆభరణాలూ విప్పి ఒక పెట్టెలో పెట్టి, ఆ కుర్రవాణ్ణి తన కొడుకు లాగే పెంచసాగాడు.

కడతేర్చే ఉపాయం చూడమన్నాడు. మంత్రి లవుణ్ణి ఏకాంతంగా పిలిపించి, "ఇంద్రజాల విద్య అంటే మహారాజుగారికి చాలా ఇష్టం. అందుచేత నీకు ప్రత్యేకమైన అతిథి సత్కారం ఏర్పాటు చేయమన్నారు. ఇవాళ నువు దివాణంలోని అతిథి గృహంలో రాజుగారి ఆతిథ్యం స్వీకరించు. నీ ప్రద ర్శనం రేపటికి ఏర్పాటు చేస్తాం," అన్నాడు.

లవుడు పరమానంద భరితుడై అందుకు సమ్మతించాడు. ఆ రాత్రే అతను మంత్రి పెట్టించిన విషాన్నం తిని చనిపోయాడు. తెల్లవారే లోపుగా మంత్రి లవుడి శవాన్ని నౌకర్ల చేత రహస్యంగా పాతేయించాడు.

తోరణ రాజు తన కొడుకు నెవరో ఎత్తుకుపోయారని తెలియగానే హతాసుడై పోయాడు. తాను తీసుకున్న జాగ్రత్త అంతా వృథా అయింది. లేక లేక, కలిగిన కొడుకు కాస్తా పోనే పోయాడు. కొడుకు కోసం విల పిస్తున్న రాజుతో మంత్రి, "మహారాజా, విచారించకండి. ఏది జరుగుతుందని రాసి పెట్టి ఉన్నదో అదే జరిగింది. అబ్బాయిని ఎత్తుకుపోయిన వాడు తప్పక ఇంద్రజాలి కుడే అయి ఉంటాడు; మనం చంపిన కుర్రవాడి తండ్రో, దగ్గిర బంధువో అయి ఉంటాడు. ఇది మనం చేజేతులా చేసు కున్నదే నని నాకు తోస్తున్నది. అయినా మన జ్యోతిష్కులు అబ్బాయికి ప్రాణ హాని ఉన్నట్టు చెప్పలేదు. కొంత కాలానికి మంచి రోజులు వచ్చి అతనే వస్తాడు," అన్నాడు.

లవుడు హత్య చేయబడే నాటికి పదహా రేళ్ళ వాడు. మారదేవుడు రాజకుమారుణ్ణి పదహారేళ్ళు నిండేదాకా పెంచి తన పగ తీర్చుకునే ప్రయత్నం ప్రారంభించాడు. అతను రాజపుత్రుణ్ణి వెంటబెట్టుకుని తోరణ దేశానికి వచ్చి, ఒక సత్రంలో దిగాడు. అతను రాజకుమారుడితో, "నాయనా, నువ్వీ పెట్టె తీసుకుని రాజుగారి దర్శనం చెయ్యి. నువు పసివాడివై ఉండగా



నీ అన్న ఈ తోరణ రాజుగారి ఆతిథ్యం పొందాడు. వారు మీ అన్న కిచ్చిన బహు మానానికి బదులుగా ఈ పెట్టెను వారి కిస్తున్నట్టు చెప్పి మరీ ఇయ్యి," అన్నాడు.

రాజపుత్రు డాశ్చర్యంతో, "నా కొక అన్న ఉన్నాడా? ఇంత కాలమూ చెప్పనే లేదే?" అన్నాడు.

"ముందు నే చెప్పినట్టు చెయ్యి. తర వాత మీ అన్న సమాచారం నీకే తెలు స్తుంది!" అన్నాడు మారదేవుడు.

రాజపుత్రుడు పెట్టె తీసుకుని రాజుగారి దర్శనం కోసం సభకు వెళ్ళాడు. అతను రాజుగారికి నమస్కారం చేసి, "మహారాజా,

నేను మారదేవు డనే ఇంద్రజాలికుడి కొడుకును. చాలా ఏళ్ళ క్రితం మా అన్న ఇంద్రజాలం చూపిస్తానని వచ్చినప్పుడు మీరు అతనికి ఆతిథ్య మిచ్చి మంచి బహు మాన మిచ్చారు. అందుకు ప్రతి బహుమా నంగా మా తండ్రి మీ కీ పెట్టె ఇవ్వ మన్నాడు," అంటూ తాను తెచ్చిన పెట్టెను రాజుగారి ముందు పెట్టాడు. రాజుగారు పెట్టె మూత తీసి చూడగానే, తన కొడుకు కనిపించ కుండా పోయినప్పుడు ధరించిన దుస్తులూ, నగలూ అందులో ఉన్నాయి.

దుఃఖంతోనూ, కోపంతోనూ ఆయనకు మతిపోయినట్టయింది. ఆయన ఆవేశంతో కత్తి దూసి తన కొడుకును చంపబోయాడు. మంత్రి ఆయనకు అడ్డుపడి, "తొందర పడ కండి, మహారాజా. ఇవి అబ్బాయి వస్తువు లన్న మాట నిజమే. కాని ఆ ఇంద్రజాలి కుడు అబ్బాయిని నిజంగా చంపి ఉన్న ట్టయితే వాటిని అప్పుడే పంపించి ఉండే వాడు. ఈ కుర్రవాడు చూడగా అబ్బాయి వయసుగానే కనిపిస్తున్నాడు," అన్నాడు.

మంత్రి రాజుగారి ముందున్న పెట్టె నుంచి వస్తువులను ఒక్కొక్కటే బయటికి తీయగా, అట్టడుగున ఒక చిన్న చీటీ ఉన్నది. అందులో ఇలా ఉన్నది: "రాజా, నీ కొడుకునే నీవు హత్య చేశావు. ఒకనాడు నా కొడుకును చంపించినందుకు నే నిలా పగ తీర్చుకున్నాను."

మంత్రి అడ్డుపడి ఉండకపోతే, ఇంద్ర జాలికుడు ఊహించినట్టుగానే ఆయన తన కొడుకును తానే చంపి ఉండేవాడు. రాజు తన కొడుకును కౌగిలించుకుని ఆనంద బాష్పాలు రాల్చాడు. ఆయన వెంటనే తన మనుషులను సత్రానికి పంపి ఇంద్రజాలి కుణ్ణి పిలిపించి, లవుణ్ణి తాను నిష్కార ణంగా చంపినందుకు క్షమాపణ చెప్పుకుని, అతని కొక మంచి ఈనాం ఇచ్చి తన వద్దనే ఉంచుకున్నాడు.





# మంత్రి యుక్తి

మణిపుర రాజు తన కూతురు మాణిక్య దేవికి జన్మదినపు కానుకగా ఒక నవరత్న హారం చేయించాడు. అది ఎన్నో వందల మణులలో నుంచి నిపుణులు ఏర్చి కూర్చిన నవరత్నాలహారం, చాలా విలువైనది. అలాటి హారం కాస్తా ఒక రాత్రి వేళ దొంగిలించబడింది.

ఎక్కడో అంతఃపురంలో పడుకున్న రాజకుమార్తె మెడలోని హారాన్ని బయటినుంచి వచ్చినవాళ్ళు దొంగిలించే అవకాశం లేదు. రాజభవనంలో ఉండే వాళ్ళలోనే ఎవరో ఆ పని చేశారు.

ఒక్కొక్కరినీ పిలిచి అడిగితే నిజం బయటపడదు. ప్రతి ఒక్కరినీ పిలిచి, "నువ్వే దొంగతనం చేసి ఉంటావు!" అన్న ధోరణిలో ప్రశ్నలు వేస్తూపోతే, ప్రశ్నించే వాడి అసమర్థత మాత్రమే బయటపడుతుంది.

అందుచేత మంత్రి దొంగను పట్టుకోవటానికొక యుక్తి పన్నాడు. అయన మధ్యాన్నానికి ముందుగానే తన మనుషులకు ముగ్గురికి ఏం చెయ్యవలసినదీ చక్కగా బోధ చేసి, మధ్యాన్నం దాటినాక రాజభవనపు సావడిలో అందరినీ సమావేశపరిచి, "రాత్రి ఎవరో మనలోవాళ్ళే రాజకుమార్తె నవరత్నహారం కాజేశారు. దొంగతనం చేసినవాళ్ళు వెంటనే హారం తెచ్చి ఇస్తే ఈసారికి వాళ్ళను క్షమిస్తాను. లేని పక్షంలో వాళ్ళు దుర్భరమైన బాధపడి చస్తారు. ముందే చెప్పాను," అన్నాడు. ఎవరూ మాట్లాడలేదు.

ఇంతలోనే ఆ ప్రదేశానికి ఒక భూతవైద్యుడు లాటి మాంత్రికుడొకడు హడావిడిగా వచ్చాడు.

"దయచెయ్యండి, స్వామీ! మీ మంత్రశక్తి అవసరమయే లాగే కనబడుతుంది,"

భూత విశ్వనాథం

అని మంత్రి ఆ భూత వైద్యుణ్ణి సగౌర వంగా ఆహ్వానించాడు.

అదే సమయంలో ఒక వర్తకుడి వేషంలో ఉన్న మనిషి పరిగెత్తుకుంటూ వచ్చి, "మహామంత్రీ, రక్షించండి! నిన్న రాత్రి నా ఇంట దొంగలుపడి పదివేల రూపాయలు కాజేశారు!" అంటూ మంత్రి కాళ్ళ పైన పడిపోయాడు.

మంత్రి వెంటనే భూత వైద్యుడి కేసి తిరిగి, "స్వామీ, ఈ వర్తకుడి ఇల్లు దోచిన దొంగను ముందు అంతుతేల్చండి. ఇంటి దొంగ సంగతి తరవాత నిదానంగా చూడ వచ్చు," అన్నాడు.

భూతవైద్యుడు వెంటనే తన కమండలం నుంచి ఇన్ని నీళ్ళు తీసి, "హ్రాం! హ్రీం!" అంటూ ఏదో మంత్రాలు చదివి ఆ జలాన్ని అక్కడ చేరినవారి పైన చల్లాడు. వెంటనే వారిలో ఒకడు కెవ్వున అరిచి, కిందపడి, యమయాతన పడుతూ గిలగిలా తన్నుకో సాగాడు. వాడంత బాధలోనూ, "చంప కండి! నేనే దొంగతనం చేశాను. సొమ్మిచ్చు కుంటాను!" అని మూలిగాడు.

"వాణ్ణి అలా తన్నుకోనివ్వండి, స్వామీ. పనిలో పని నవరత్నహారం దొంగిలించిన మనిషిని కూడా వెంటనే మంత్రించండి," అన్నాడు మంత్రి.

వెంటనే ఒక దాసీది ముందుకు వచ్చి మంత్రి కాళ్ళ పైన పడి, "క్షమించండి మహాప్రభూ! గడ్డి తిని నేనే ఆ హారాన్ని దొంగిలించాను. నన్ను కాపాడండి!" అంటూ ఏడవసాగింది.

వెంటనే కిందపడి మూలుగుతూ పొర్లు తున్నవాడు నవ్వుతూ లేచి కూర్చున్నాడు. భూతవైద్యుడూ, వర్తకుడూ కూడా తమ వేషాలు విప్పేశారు.

వాళ్ళు ముగ్గురూ మంత్రి మనుషులే. వాళ్ళు ఆడిన నాటకం మూలానే పోయిన నవరత్నహారం తిరిగి దొరికింది.





# కోటీశ్వరుడు

కంచిలో ఒక వైశ్యుడుండే వాడు. అతను వర్తకం చేసి అంతులేని డబ్బు సంపాదించి, కోట్లు గడించి, నవ కుబేరుడనే పేరు పొందాడు. అతనికి అనేక మంది కొడుకులూ, కూతుళ్ళూ కలిగారు. అతను వారందరికీ పెళ్ళిళ్ళు చేసి, అల్లుళ్ళను కూడా తన వద్దనే ఉంచుకుని, వాళ్ళకు కూడా పనులు కల్పించి, తన వర్తక వ్యాపారాలను ఇంకా పెంచుకున్నాడు. కాలక్రమాన అతని బంధుకోటి పెరిగి, అతని ఇల్లు ఒక దివాణంగా మారిపోయింది. బంధువుల మధ్య అతను అత్యంత వైభవంతో జీవిస్తూ రాజయోగంగా అనుభవించాడు.

అయితే నవకుబేరుడు తన ఇల్లు దాటితే పరమ లోభి. అతను దాన ధర్మాల కింద గాని, తీర్థయాత్రల కనిగాని, దేవుడి పేరు చెప్పిగాని ఏనాడూ చిల్లి గవ్వ ఖర్చు పెట్టి ఎరగడు.

ఇలా ఉండగా ఒకనాడు నవకుబేరుడి ఇంటి ముందు ఒక బైరాగి వచ్చి నిలబడి, తనకా పూట భోజనం పెట్టించమన్నాడు.

"పోరా, దొంగ వెధవా! నువ్వెక్కణ్ణించి ఊడిపడ్డావు!" అని నవకుబేరుడు చీదరించుకున్నాడు.

"నేను దొంగనైతే బిచ్చమెత్తుకునే కర్మేమిటి?" అన్నాడు బైరాగి.

ఇద్దరికీ కొంచెంసేపు వాదన జరిగిన మీదట, ఆ బైరాగివాడు తన కాలం వృథా చేస్తున్నాడని కోపం వచ్చి, నవకుబేరుడు అతన్ని తన నౌకర్ల చేత బయటికి గెంటించాడు. బయటికి గెంటినా ఆ బైరాగి, స్వయంపాకం ఇస్తేనేగాని వెళ్ళనని భీష్మించుకుని, సాయంకాలం దాకా ఇంటి కెదురుగా కూర్చున్నాడు.

"నువ్విక్కడే చచ్చినప్పటికీ నేను స్వయంపాకం ఇవ్వను. ఎంత కాలం

ఆర్. జోగేశ్వరరావు



కూర్చుంటావో కూర్చో," అన్నాడు నవకుబేరుడు. ఆ బైరాగి మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ వీధి వాకిలి కెదురుగా అలాగే కూర్చున్నాడు. ఆ బైరాగి శపిస్తాడేమో నని అప్తులు నవకుబేరుడితో అన్నారు. కాని అతను భయపడలేదు; వీధి తలుపు మూయించి మరొక ధారిన రాకపోకలు ఏర్పాటు చేసుకున్నాడు.

కొన్ని రోజుల అవతల చూస్తే బైరాగి ఎటో వెళ్ళిపోయాడు. తానొక ఘనవిజయం సాధించినట్టు నవకుబేరుడు సంతోషించాడు. కాని వీధి వాకిలి తెరిచిన మర్నాడే మళ్ళీ బైరాగి ప్రత్యక్షమయాడు.

"ఈ బైరాగి నన్ను శనిలాగా పట్టాడే! మళ్ళీ ఎందుకు వచ్చాడో కనుక్కురా," అని నవకుబేరు డొక మనిషిని పంపాడు.

"నేను నిన్నేమీ యాచించటానికి రాలేదు. నీతో కొంచెం మాట్లాడాలి," అని బైరాగి నవకుబేరుడికి కబురు చేశాడు.

ఆరు నెలల దాకా తనకు తీరదని నవకుబేరుడు జవాబు పంపాడు. బైరాగి వెళ్ళిపోయి సరిగా ఆరు నెలలకు మళ్ళీ వచ్చాడు. నవకుబేరుడు మరి కొన్ని వాయిదాలు వేశాడు. బైరాగి ఎంతో ఓపికగా వాయిదా నాటికి వస్తూ వచ్చాడు. ఇలా ఏడాది గడిచింది. ఆ బైరాగి చెప్పేది తాను వినక తప్పదనుకుని చివరకు నవకుబేరుడు అతన్ని పిలిపించాడు.

"ఏడాది నుంచీ చూస్తున్నాను. నువు మాయ చేత కప్పబడి, ఈ భార్యా పుత్రులనూ బంధువులనూ నమ్ముకుని గుడ్డివాడివైపోయావు. కళ్ళు తెరిచి నిజం తెలుసుకో!" అన్నాడు బైరాగి.

"అయిన వాళ్ళందరినీ వదులుకోమని చెప్పటానికేనా ఇంత కాలమూ నా చుట్టూ తిరిగావు?" అని నవకుబేరు డడిగాడు.

"వీళ్ళలో నీకు నిజంగా అయినవాడు ఒక్కడూ లేడు. నువు సంపాదించి పెట్టు

తున్నంత కాలమూ వీళ్ళు నీకు బ్రహ్మరథం పడతారు. ఆ తరవాత నిన్ను జీవచ్ఛవంగా చూస్తారు. కావలిస్తే ఈ మాట రుజువు చేస్తాను," అన్నాడు బైరాగి.

అందుకు వైశ్యుడు కూడా ఒప్పుకున్నాక, బైరాగి ఒక ఉపాయం చెప్పి వెళ్లిపోయాడు.

తరవాత కొద్ది రోజులకు ఒకనాటి రాత్రి నవకుబేరుడు తన కేదో రోగం సంప్రాప్త మైనట్టు నటించాడు. ఆయన తన భార్యతో, "నాకు చావు దగ్గిర పడింది. ఇన్నాళ్ళు బతికాను గాని ఒక్క పుణ్యకార్యం చెయ్య టానికి కూడా నాకు వ్యవధి చిక్కలేదు. ఈ చావు ఇంకొక్క ఏడాది ఆగి వస్తే ఎంతో బాగుండేది," అంటూ ఉన్నపాళంగా బిర్ర బిగుసుకు పోయాడు.

నవకుబేరుడి భార్య కంగారుపడి వైద్యుణ్ణి పిలిపించింది. వైద్యుడు వచ్చి పరీక్ష చేసి, రోగం అంతు చిక్కక, తాను చేసేదేమీ లేదని చెప్పి వెళ్ళిపోయాడు. నవకుబేరుడు బైరాగి చెప్పిన విధంగా ఊపిరి బిగబట్టి ప్రాణం పోయినట్టు నటించాడు.

అతని మీదపడి ఏడుస్తున్నవారు దాదాపు రెండు వందలమంది ఉన్నారు. వాళ్ళంతా నవకుబేరుడి చుట్టూ చేరి శోకాలు పెట్ట సాగారు. కొందరు శ్మశాన వైరాగ్యం చెప్పి, ఎంత వారికీ చావు తప్పదన్నారు.



సరిగా అదే సమయానికి బైరాగి ఒక లోటాలో పాలు తీసుకుని అక్కడికి వచ్చి, అందరినీ ఊరుకోమని సైగ చేసి, "ఈ చచ్చి పోయిన మనిషిని బతికించుకోవాలని మీలో ఎవరికైనా కోరిక ఉన్నట్టయితే చెప్పండి. ఇదుగో సిద్ధౌషధం!" అన్నాడు.

నవకుబేరుడి భార్యా మొదలైన వాళ్ళు ఆ బైరాగి కాళ్ళ మీదపడి, "బాబూ, రక్షించండి, మీ రేంకోరితే అది యిస్తాం. ఆయనకా సిద్ధౌషధం యిచ్చి బతికించండి," అని ప్రాథేయపడ్డారు.

దానికా బైరాగి, "వెర్రివాళ్ళలారా, ఎంత సిద్ధౌషధమైనా ఆయువు మూడిన వారికి ఆయుర్దాయం ఇవ్వగలదా? ఈ ఔషధం మీలో ఎవరైనా తాగినట్టయితే వారు వెంటనే చచ్చిపోతారు. వారి ఆయుశ్శేషంతో ఈ చనిపోయిన మనిషి కొంత కాలం బతుకుతాడు. ఇతనికి తమ ఆయువు నివ్వటానికి సిద్ధంగా ఉన్నవాళ్ళు ముందుకు వచ్చి ఈ ఔషధం తీసుకుని తాగెయ్యండి, అతను బతుకుతాడు," అన్నాడు.

ఎవరూ పలకలేదు. కొంచెంసేపు చూసి బైరాగి, "ఎవరూ ఈ మనిషి కోసం చావరా?" అని అడిగాడు. జవాబు లేదు.

"అయ్యో, ఈ మనిషి తన జీవితమంతా వీళ్ళందరినీ సుఖపెట్టటానికి ధారపోసి, పరలోకంలో సుఖపడటానికి ఒక్క పుణ్యకార్యమైనా చెయ్యకుండా చనిపోయాడే! ఒక్కరైనా అతని కోసం తమ ప్రాణాల నివ్వకుండా ఉన్నారే!" అన్నాడు బైరాగి.

"స్వామీ, కళ్ళు తెరుచుకున్నాయి!" అంటూ నవకుబేరుడు లేచి కూర్చున్నాడు. అందరూ నిర్ఘాంతపోయి, నిశ్చేష్టులయారు.

ఆ తరవాత నవకుబేరుడు పనికిమాలిన తన బంధువులనందరినీ వెళ్ళగొట్టి, తనకు గల అంతులేని సంపదను దాన ధర్మాలకు, వినియోగిస్తూ, వర్తకమంతా కొడుకుల పరం చేసి పవిత్రమైన జీవితం గడిపాడు.






# ఇంటి మహిమ

పాపన్న ఉండే గ్రామంలో గోపన్న అని ఒక గృహస్థు ఉండేవాడు. వారిద్దరూ ఇంచు మించు ఒకే వయసువాళ్ళు. ఒకరి నొకరు చిన్నతనం నుంచీ బాగా ఎరుగుదురు.

వారిద్దరికీ ముఖ్యమైన తేడా ఏమంటే గోపన్నది భారీ అయిన కుటుంబం. అయితే అతని ఆస్తి అంత కుటుంబాన్ని భరించ గలది కాదు. అయినప్పటికీ గోపన్న చెయ్యి చాచి ఒకరిని అర్థించకుండా, ఏమీ లోటు లేకుండా సంసారం ఈదుతూ వస్తున్నాడు.

పాపన్న గోపన్న ఇంటికి వెళ్ళినప్పుడల్లా గోపన్న పిల్లలు, "మామయ్యా! మామయ్యా!" అంటూ అతని చుట్టూ మూగేవారు. పాపన్న పళ్ళుగానీ, జంతికలుగానీ, మిఠాయిగానీ ఏదో ఒకటి తీసుకుని మరీ వెళ్ళేవాడు, వాటిని గోపన్న పిల్లలకు పంచిపెట్టేవాడు.

ఒకనాడు పాపన్న గోపన్న ఇంటికి వెళ్ళే సరికి అక్కడ చాలా గొడవగా ఉన్నది. కొన్ని ఏళ్ళ క్రితం గోపన్న బస్తీలో ఉండే ఒక షావుకారు వద్ద పత్రం రాసి వెయ్యి రూపాయలు అప్పు చేశాడు. ఆ బాకీలో ఏ మాత్రమూ చెల్లుబడకపోగా, వడ్డీ మీద వడ్డీ అయి పాపం లాగా పెరిగి, గోపన్న ఇవ్వదేలిన మొత్తం రెండు వేలై కూర్చుంది. గోపన్న బాకీ తీర్చలేడనీ, ఇంక ఆలస్యం చేస్తే గోపన్న హామీ పెట్టిన ఆస్తి కన్న బాకీ ఎక్కువవుతుందనీ అనుకుని షావుకారు గోపన్న ఆస్తికి జప్తు తెచ్చాడు. ఈ రోజు అతను గ్రామాధికారి మొదలైన వాళ్ళను వెంటబెట్టుకుని గోపన్న ఆస్తి స్వాధీనం చేసుకోవటానికి వచ్చాడు.

పాపన్న వచ్చేసరికి గోపన్నా, అతని భార్యా, తల్లీ, పిల్లలూ ఇంటి వెలపలే వున్నారు. "ఎవరికీ తెలియకుండా ఎంత పని చేశావురా?" అని గోపన్నను తల్లి తిట్టిపోస్తున్నది.



షావుకారు, "ఇంకెంత కాలమని ఆగేది? ఎన్ని సార్లో బాకీ మాట జ్ఞాపకం చేశాను. పోయినకొద్దీ వడ్డీ పెరిగిపోతూండె. ముందు ఇల్లు ఖాళీ చేసెయ్యండి," అంటున్నాడు.

పాపన్న ఈ సమయంలో రావటం గోపన్న కేమీ ఇష్టం లేదు. ఎందుకంటే పాపన్న ఏదో విధంగా అడ్డుపడకుండా ఉండడు. అలా సహాయం పొందటం గోపన్న కిష్టం లేదు.

పాపన్న షావుకారునూ, గ్రామాధికారినీ అవతలకు తీసుకుపోయి మాట్లాడి విషయమంతా తెలుసుకున్నాడు. తన బాకీ వసూలు చేసుకోవాలని షావుకారు చాలా పట్టుదలగా ఉన్నాడు. అదీగాక అతనికి గ్రామంలో కొంత అస్తి సంపాదించి, గ్రామ జీవితం గడపాలని ఉన్నది. బస్తీలో వాళ్ళ వ్యవహారాలన్నీ చూడటానికి షావుకారు తండ్రి ఉన్నాడు, తమ్ముడు కూడా ఉన్నాడు.

పాపన్న షావుకారుతో చెప్పవలిసిన మాట ఒకటి చెప్పి, గోపన్న వద్దకు వచ్చి, "ఇల్లు వదిలి ఎక్కడ ఉంటావు? పదండి ఇంట్లోకి. నే నుండగానే పంచ లేకుండా పోదా మనుకున్నావా?" అన్నాడు. అతను గోపన్న పిల్లలను దగ్గిరికి పిలిచి, వారందరికీ తాను తెచ్చిన తినుబండారాలు పంచి ఇచ్చి, "హాయిగా వెళ్ళి ఆడుకోండి," అన్నాడు.

గోపన్న కళ్ళనీళ్ళ పర్యంతమై, "పాపన్నా, పూర్తిగా మునిగిపోయిన వాణ్ణి నువేం కాపాడగలవు? జరిగేదేదో జరగనీ! ఈ అప్పు తీరేది కాదు. ఇవాళ కాకపోతే రేపైనా నా యిల్లూ, పొలమూ అప్పులవాళ్ళ పాలు కావలిసిందే!" అన్నాడు.

"అదంతా నువు నాకు చెప్ప నవసరం లేదు. నువీ ఇల్లు విడిచి పెడితే నా పైన ఒట్టే!" అన్నాడు పాపన్న గోపన్నతో.

అతను షావుకారునూ, మిగిలినవాళ్ళనూ వెంటబెట్టుకుని తన యింటికి వచ్చాడు. అతను వాళ్ళతో గోపన్న బాకీ తాను చెల్లు

వేస్తానని అన్నాడు. కాని అతని వద్ద అంత డబ్బు లేదు. అతనికి అప్పు లిచ్చేవాళ్ళు కూడా లేరు. ముందు వెనకలు చూడకుండా దగ్గిర ఉన్నదంతా తుడిచిపెట్టి ముక్కూ మొహమూ ఎరగని వాళ్ళకు సైతం ఇచ్చేసే పాపన్నకు అప్పు ఎవరిస్తారు? అందుచేత పాపన్నకు కీర్తి తప్ప పరపతి ఏమీ లేదు.

షావుకారు కూడా పాపన్నతో, "మీ రెలా చేసినా నా కిష్టమే. కాని ఈ ఋణం ఇవాళ తీరిపోవాలి. రొక్కమయినా ఇవ్వండి, లేక పోతే, అదే విలువ గల ఆస్తయినా ఇవ్వండి," అన్నాడు.

"అలాగే కానివ్వండి. నా ఇల్లూ, పొలమూ రాసి ఇచ్చేస్తాను. నా ఆస్తి గోపన్న ఆస్తికి ఒక్క పిసరు హెచ్చే ఉంటుంది. అది తీసుకుని గోపన్న ఋణ పత్రం రద్దు చేసి ఇచ్చెయ్యండి," అన్నాడు పాపన్న.

షావుకారు అందుకు సంతోషంగా సమ్మతించాడు. నిజానికి గోపన్న ఆస్తి కన్న పాపన్న ఆస్తే కాస్త హెచ్చు విలువ గలది.

పాపన్న ఇల్లూ, పొలమూ తన పేర రాయించుకుని షావుకారు అతనికి అదనంగా ఒక వందరూపాయలు రొక్కం ఇచ్చాడు.

ఈ తతంగం పూర్తి కాగానే పాపన్న సకుటుంబంగా తన అత్తవారి ఊరు వెళ్ళి



పోయాడు. అతని భార్య మీనాక్షి తల్లిదండ్రులకు ఒకే బిడ్డ. అందుచేత పుట్టింటి తాలూకు ఆస్తి అంతా ఆమెదే. వారికి కూడా ఒక ఇల్లూ, కొంత పొలమూ ఉన్నాయి.

ఇల్లు వదిలి పోయేటప్పుడు పాపన్నతో అతని తల్లి, "ఒకనాడు ఈ గతి తెచ్చి పెడతావని నే ననుకుంటూనే ఉన్నానురా!" అన్నది.

"ఇప్పుడేం మునిగిపోయిందమ్మా? ఒకరికి మేలు చేస్తే మనకూ మేలే జరుగుతుంది," అన్నాడు పాపన్న.

షావుకారు తన భార్యతోనూ బిడ్డలతోనూ వచ్చి పాపన్న ఇంట ప్రవేశించాడు. అది



మొదలు షావుకారు వైఖరిలో మార్పు కలిగింది. అతను పాపన్న ఇంటికి మరమ్మత్తు చేయించి, కొత్త గదులూ, వసారా కట్టించి, కూలి వాళ్ళకు ఇవ్వవలిసిన దాని కన్న బాగా హెచ్చు కూలి ఇచ్చాడు. అదిమొదలు అతను నిత్యమూ దాన ధర్మాలు చేస్తూ, ఎరగని వాళ్ళను సైతం ఆదుకుంటూ దాన కర్ణుడని త్వరలోనే కీర్తి పొందాడు. ఆ గ్రామంలో వాళ్ళు ఈ షావుకారు గురించి ఒట్టి పిసినారి అనీ, డబ్బు కోసం నానా గడ్డీ తింటాడనీ విని ఉన్నారు. అందుచేత అతని దాతృత్వాన్ని కళ్ళారా చూసి వాళ్ళు చాలా ఆశ్చర్యపడ్డారు.

పాపన్న వెళ్ళి పోతున్నాడంటే పరోపకారమే వెళ్ళి పోతున్నదని విచారించిన వాళ్ళకు ఈ షావుకారు పాపన్న కన్న కూడా మెరుగనిపించాడు. ఎందుకంటే, ఇద్దరూ పరోపకార పారీణులే అయినా, పాపన్న ధనికుడు కాడు, హెచ్చుగా శ్రమ దానం చేసేవాడు. ఈ షావుకారు దగ్గిర పుష్కలంగా డబ్బున్నది, ధన సహాయం చెయ్యటానికి వెనకాడడు.

అయితే కొద్ది రోజుల కల్లా ఒక పుకారు బయలుదేరింది. ఈ షావుకారు స్వతః దాతృత్వం కలవాడు కాడనీ, పాపన్న ఇంట ప్రవేశించిన తరవాతనే అతనిలో ఈ దాతృత్వం పుట్టుకొచ్చిందనీ, దానికి అసలు కారణం పాపన్న ఇల్లేననీ, అందులో ఏదో మహిమ ఉన్నదనీ జనం చెప్పుకోసాగారు.

బస్తీలో ఉంటున్న షావుకారు తండ్రికి తన కొడుకు కీర్తి గురించీ, అందుకు జనం చెప్పుకుంటున్న కారణం గురించీ ఒక్కసారిగానే తెలియ వచ్చింది. తన కొడుకు పల్లెటూరు చేరి ఎర్రపైగాని సంపాదించక పోగా, ఉన్నదంతా ఎడాపెడా దానధర్మాల కింద ఖర్చు చేసి దానకర్ణుడని పేరు సంపాదించుకుంటున్నాడని విని ఆ పెద్దమనిషికి మతి పోయినట్టయింది. తన కొడుకలా మారి

పోవటానికి కారణం అతను ఉంటున్న ఇల్లే నని విని, ఆయన తన కొడుకు వద్దకు వెళ్ళి, "నువు తక్షణం ఈ ఇల్లు అమ్మేసి బస్తీకి వచ్చెయ్యి. లేకపోతే ఉన్నదంతా ఊడ్చిపెట్టుకు పోతుంది," అన్నాడు.

ఆ ఇల్లు తనకు చాలా సుఖంగా ఉన్న దనీ, పరోపకారం చెయ్యటం ద్వారా తనకు అంతులేని ఆనందం కలుగుతున్నదనీ షావుకారు తండ్రికి చెప్పి చూశాడు. అత నలా అనటం వల్ల తండ్రి ఆదుర్దా మరింత హెచ్చింది. తన కొడుకు ఆ గ్రామంలో ఒక్క క్షణం కూడా ఉండటానికి వీల్లేదని చెప్పి ఆయన అతన్ని అప్పటి కప్పుడే పెళ్ళాం బిడ్డలతో సహా బస్తీకి ప్రయాణం కట్టించాడు.

షావుకారు స్వాధీన పరుచుకున్న పాపన్న ఇల్లూ, పొలమూ అమ్మటానికి చేసిన ప్రయత్న మంతా వృథా అయింది. ఎందు కంటే ఆ ఇంట అడుగు పెట్టిన వాళ్ళు త్వరలోనే ముష్టి చెంబు పట్టుకుంటారని ప్రవాదు పడిపోయింది. ఆ కారణం చేత దాన్ని కొనటాని కెవరూ సాహసించి ముందుకు రాలేకపోయారు.

"ఆ ఇల్లు మర్యాదగా పాపన్నకే తిరిగి ఇచ్చెయ్యండి. దాన్ని మరెవరూ కొనరు. అందులో ఊరికే ఉండమన్నా ఎవరూ ఉండరు," అని గ్రామాధికారి షావుకారు తండ్రికి సలహా ఇచ్చాడు. షావుకారు తండ్రి గ్రామాధికారిని వెంటబెట్టుకుని పాపన్న అత్తవారి ఊరు వెళ్ళి, "బాబూ, నీకూ నీ ఆస్తికీ ఒక నమస్కారం. అదంతా నువే తిరిగి పుచ్చుకో. అది మాకు అచ్చిరాలేదు," అని చెప్పాడు.

పాపన్న తిరిగి తన గ్రామం చేరుకుని తన ఇంట్లో ప్రవేశించాడు. అతనికి కలిగిన నష్టమేమీ లేదు; ఇల్లు చక్కగా మరమ్మతు కావటమేగాక మరింత పెద్దదికూడా అయి, ఉండటానికి మహా సుఖంగా ఉన్నది!





# రాజ సత్కారం

ఒక గ్రామంలో గోవిందు డనే యువకు డుండేవాడు. అతని బుద్ధి సునిసితమైనది. కాని మనిషి చాలా దుర్బలుడు. గ్రామ జీవితంలో శరీర శ్రమకు ఎక్కువ విలువ ఉంటుంది గనుక, గోవిందుడు పనికిమాలిన వాడుగా పరిగణించబడుతూ ఉండేవాడు. అతని అన్నా, వదినే అతన్ని చూసి, ఏ పనీ చెయ్యలేని వాడని చాలా విసుగు చెందుతూ ఉండేవారు. కాని గోవిందుడు ఊళ్ళో వాళ్ళకు అప్పుడప్పుడూ చాలా మంచి సలహా లిస్తుండే వాడు. ఆ సలహాల వల్ల వాళ్ళకు లాభం కలుగుతూండేది. వాళ్ళు గోవిందుడి అన్న తో, "మీ గోవిందుడు నిజంగా చాలా తెలివిగలవాడు," అనేవాళ్ళు.

తన తమ్ముడి తెలివితేటలను గురించి ఊళ్ళో వాళ్ళు తెగ మెచ్చుకొనటం కూడా అన్నకు విసుగెత్తించింది. ఒకనా డతను, "గోవిందుడు అంత తెలివిగలవాడైతే రాజ సభకు వెళ్ళి సన్మానం పొందరాదూ? యిక్కడ కూర్చోవటం దేనికీ?" అన్నాడు.

"అంత ప్రయోజకుడైతే ఇంక లేని దేముందీ?" అన్నది వదినె.

ఈ మాటలు గోవిందుడు విన్నాడు. అతనికి రాజసన్మానం పొందాలని పించింది. ఉగాదినాడు రాజుగారు దర్బారు చేసి, పౌరులను కొన్ని ప్రశ్న లడుగుతాడు. ఆ ప్రశ్నలకు తెలివిగా సమాధానా లిచ్చిన వారికి బహుమానాలు లభిస్తాయి. ఉగాది దగ్గరలోనే ఉన్నది. ఆ రోజుకు గోవిందుడు రాజధానికి చేరుకుని, రాజసభకు వెళ్ళాడు.

రాజుగారి ప్రశ్నలకు సమాధానాలు చెప్ప టానికి సిద్ధంగా ఉన్నవారిని ఒక ప్రత్యేక స్థలంలో కూర్చోబెట్టారు. రాజుగారు వాళ్ళను సాధారణమైన ప్రశ్నలే అడిగాడు.

"మన రాజ్యంలో సత్యసంధు లెంద రున్నారు?" అన్నది ఆయన మొదటి ప్రశ్న.

టి. గోవిందాచారి

రాజ్యంలో సుమారు ఒక లక్షమంది సత్యసంధు లని ఒకరూ, జనాభాలో పదో వంతు మంది సత్యసంధు లుంటారని ఇంకొకరూ సమాధానాలు చెప్పారు.

"మీ కింద కొలువు చేసే అయిదు వందల మందీ సత్యసంధులే," అన్నాడు గోవిందుడు.

"ఎలా చెప్పగలవు?" అన్నాడు రాజు.

"వారిలో సత్యసంధుడు కానివాడుంటే మీరు వాణ్ణి ఎప్పుడో పంపేసి ఉందురు," అన్నాడు గోవిందుడు.

రాజుగారు ఇంకో ప్రశ్న వేశాడు: "నా కిష్టమైన బట్టలు ఎలా దొరుకుతాయి?"

"ప్రజలు మీకు కానుక పెడతారు," "పత్తి నుంచి వస్తాయి," ఇలా తలా ఒక విధంగా సమాధానాలు చెప్పారు. "పని తనం తెలిసిన నేతగాళ్ళు మీ కిష్టమైన బట్టలు నేసి పెడతారు," అన్నాడు గోవిందుడు.

"ఎవరూ నమ్మలేని అబద్ధం చెప్పాలి," అని రాజు అడిగాడు.

"నాకు చాలా తలనొప్పిగా ఉంది," అన్నా డొకడు.

"నేను గాలిలో ఎగిరాను," అన్నాడు మరొకడు.



"నా కాళ్ళు విరిగి మళ్ళీ అతుక్కున్నాయి," అన్నా డింకొకడు.

"ఈ సభలో ఉన్న వాళ్ళందరూ గేదెలు," అన్నాడు గోవిందుడు.

ఈ విధంగా కొంతసేపు వినోద కాలక్షేపం జరిగాక రాజుగారు సభలో కొందరికి బహుమానా లిప్పించాడు. గోవిందుడికి కూడా బహుమానం వచ్చింది, కాని ఏమంత గొప్ప బహుమానం కాదు. తాంబూలంలో ఒక బంగారు కాసూ, ఒక జత మంచి బట్టలూ ఇచ్చారు. రాజుగారు ప్రత్యేకంగా చేస్తున్న విందులో భోజనం చేసి వెళ్ళమని అతన్ని కూడా ఆహ్వానించారు.

గోవిందుడు సభ చాలించగానే తనకు రాజుగారిచ్చిన బట్టలను మరెవరికో ఇచ్చేసి తాను కట్టుకున్న బట్టలతోనే భోజనానికి వచ్చాడు. అతను తప్ప మిగిలిన వాళ్ళంతా రాజుగారు పెట్టిన కొత్త బట్టలు కట్టుకున్నారు. భోజనం దగ్గిర కూడా అతను మామూలుగా తాను తినే పచ్చడి మెతుకులూ, మజ్జిగా మాత్రమే తిన్నాడు; మంచి మంచి భక్ష్యాలూ, కూరలూ, పాయసాలూ ముట్టలేదు.

గోవిందుడి వింత చర్యలను గురించి రాజుగారికి వార్త వెళ్ళింది. ఆయన గోవిందుణ్ణి పిలిపించి, "నేను బహుమానంగా ఇచ్చిన కొత్త బట్టలు కట్టుకున్నావు కావు. భోజనం దగ్గిరకూడా మంచి మంచి వంటకాలేవీ ముట్టుకున్నావు కావుట. ఇది రాజావమానం కాదా?" అని అడిగాడు.

"మహారాజా, నేను పేదవాణ్ణి. తమరిచ్చిన మంచి బట్ట లిప్పుడు కట్టుకున్నానంటే నాకు తిరిగి మామూలు బట్టలు కట్టుకో బుద్ధి పుట్టదు. అందుచేత వాటిని దానం చేశాను. రోజూ పచ్చడి మెతుకులు తిని, గంజినీళ్ళు తాగే నా బోటి వాడు పంచ భక్ష్య పరమాన్నాలు రుచిమరిగితే ఐశ్వర్యాభిలాష హెచ్చి రకరకాల దుర్బుద్ధులూ తల ఎత్తుతాయి. అందుచేత నా తాహతుకు తగినట్టుగానే ప్రవర్తించాను. రాజావమానం చెయ్యాలన్న దుర్బుద్ధి నాలో ఏ కోశానా లేదు," అన్నాడు గోవిందుడు.

"నే నిప్పించిన బంగారు కాసు కూడా దానం చేసేశావా?" అని రాజు అడిగాడు.

"లేదు, మహారాజా. నన్ను పోషించే నా అన్న కిద్దామని దాన్ని నా వద్దనే ఉంచుకున్నాను," అన్నాడు గోవిందుడు.

గోవిందుడి సద్బుద్ధికి రాజుగారు మెచ్చుకుని, అతనికి వెయ్యి బంగారు మొహరీ లిప్పించి, అతనికి తన ఆస్థానంలో మంచి ఉద్యోగం కూడా వేయించాడు.





# అంగారవతి కథ

వత్సరాజైన ఉదయనుడు వాసవదత్తను పెళ్ళాడిన కథను మనం లోగడ చెప్పుకున్నాం. వాసవదత్త తండ్రి చండ మహాసేన మహారాజు. ఆయన వివాహం ఎలా జరిగినదీ ఇప్పుడు చెప్పుకుందాం.

చండమహాసేనుడు తన యౌవనంలో చండికను గురించి గొప్ప తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి చండిక ప్రత్యక్షమై, వరం కోరుకోమన్నది. తనకు అత్యుత్తమ మైన ఖడ్గాన్నీ, అపూర్వమైన భార్యనూ ఇవ్వ మని చండమహాసేనుడు దేవిని వేడుకు న్నాడు. దేవి తన చేతి కత్తినే అతని కిస్తూ, త్వరలోనే అతనికి రత్నం లాంటి భార్య కూడా లభిస్తుందని మాట ఇచ్చింది.

ఆ శుభ సమయం కోసం చండమహా సేనుడు ఎదురుచూస్తూ ఉండగా ఉజ్జయిని నగరంలో ఒక ఘోరం చుట్టుకున్నది: నగర పాలకుడుగా నియమించబడిన ప్రతి వ్యక్తినీ రాత్రివేళ ఏదో జంతువు వచ్చి తిని పోసాగింది. ఈ రహస్యాన్ని భేదించా లనే ఉద్దేశంతో చండమహాసేనుడు తన కత్తిని తీసుకుని రాత్రివేళ ఒంటరిగా గస్తీ తిరగసాగాడు.

ఒక రాత్రివేళ అతనికి వీధిలో ఒక మనిషి ఎదురయాడు. వెంటనే చండమహా సేనుడు కత్తితో ఆ మనిషి తల తెగ నరి కాడు. అంతలోనే ఎవడో రాక్షసుడు వచ్చి చచ్చినవాడి మొండెం సంగ్రహించాడు. నగర పాలకులను తింటున్నది ఆ రాక్షసుడే అనుకుని చండమహాసేనుడు ఒక చేత్తో వాడి జుట్టు పట్టుకుని, రెండో చేత్తో వాడి తల తెగ నరకబోయాడు.

ఆ రాక్షసుడు లబోమని ఏడుస్తూ, "మహారాజా, నన్నెందుకు చంపుతావు? నగర పాలకులను తినేస్తున్న వాణ్ణి నేను కాను. వాడు మరొకడు," అన్నాడు.



"వాడెవడు ? ఎక్కడ ఉంటాడు ?" అని రాజు ఆ రాక్షసుణ్ణి అడిగాడు.

"అయ్యా, వాడి పేరు అంగారకుడు. వా డుండేది పాతాళంలో. వాడే రాత్రి వేళ వచ్చి నగర పాలకులను తినేస్తున్నాడు. అంతేకాదు, వాడు ఎందరో రాజకుమార్తెలను ఎత్తుకుపోయి, అంగారవతి అనే తన కూతురికి దాసీలుగా ఏర్పాటు చేశాడు. వాడు పగటివేళ అరణ్యంలో తిరుగుతూ ఉంటాడు; వెళ్ళి చంపి నీ కోరిక తీర్చుకో," అన్నాడు రాక్షసుడు.

చండమహాసేను డా రాక్షసుణ్ణి వదిలిపెట్టి ఆ రాత్రికి తన ఇంటికి వెళ్ళిపోయాడు. తరవాత అతను వేటకు వెళ్ళాడు. అక్కడ అతనికి ఒక విడ్డూరమైన అడవిపంది కనిపించింది. అది ఒక చిన్న కొండంత ఉన్నది. దాని కళ్ళు నిప్పుకణాల్లాగున్నాయి. "ఇది మామూలు పంది కాదు. అంగారకుడై ఉంటాడేమో!" అనుకుని చండమహాసేనుడు దాన్ని బాణాలతో కొట్టాడు. ఆ బాణాల నది ఏమాత్రమూ లక్ష్యపెట్టకపోగా రా జెక్కి ఉన్న రథాన్ని ఒక తోపుతో పడగొట్టి, భూమిలో ఒక సొరంగంలో ప్రవేశించి కనపడకుండా పోయింది.

చండమహాసేనుడు ప్రచండమైన పట్టుదలతో ఆ బిలం లోకి ప్రవేశించి కొంత సేపటి కొక దివ్యమైన నగరానికి చేరుకున్నాడు. పంది జాడ కనిపించలేదు గాని, ఒక బావి సమీపంలో నూరుమంది చెలికత్తెల మధ్యన ఒక దివ్యసుందరి లాటి కన్య కూర్చుని అతని కంట పడింది.

అతన్ని చూస్తూనే ఆమె లేచి వచ్చి అతన్ని సమీపించి, "ఎవరు మీరు? ఏం పనిమీద వచ్చారు?" అని అడిగింది. చండ మహాసేనుడు తా నొక భయంకరమైన పందిని వేటాడుతూ తరుముకుని వచ్చాననీ, ఆ పంది ఒక బిలంలో దూరి కనిపించకుండా పోయిందనీ ఆమెకు చెప్పాడు.

ఆమె కళ్ళలో ప్రేమా, జాలీ తొణికిస లాడాయి. "అయ్యో, ఎంతపని చేశారు! ఆ పంది అంగారకాసురుడు. ఆయనది వజ్రదేహం. ఆయన మహా బలుడు. ప్రస్తుతం పంది రూపం విడిచేసి నిద్ర పోతున్నాడు. నిద్ర లేచాడంటే మీకు ప్రాణహాని తప్పదు. నేనాయన కుమార్తెను. నా పేరు అంగారవతి. మీకు రానున్న ఆపద తలుచుకుంటే నా గుండెలు గొంతు కలో కొట్టుకుంటున్నాయి," అన్న దామె.

ఆమెను చూస్తూంటే చండమహాసేనుడికి దేవి తనకు అనుగ్రహిస్తానన్న భార్య ఈ అంగారవతే అయిఉంటుం దనిపించింది. అత నామెతో, "నీకు నిజంగా నాపైన ఇష్టం ఉన్న పక్షంలో నేను చెప్పి నట్టు చెయ్యి. నీ తండ్రి నిద్ర లేచేసరికి నీ వాయన సమీపానికి ఏడుస్తూ వెళ్ళు. ఎందు కేడుస్తున్నావని అడుగుతాడు. 'నిన్నెవరైనా చంపేస్తే నా గతి ఏమిటి?' అని అడుగు. అందువల్ల మన ఇద్దరికీ సుఖం కలుగుతుంది," అన్నాడు.

చండమహాసేనుడి పైన పుట్టుకొచ్చిన ప్రేమ కొద్దీ అంగారవతి తన తండ్రి నిద్ర లేచే సమయానికి ఆయన సమీపంలో చేరి ఏడవసాగింది. అంగారకాసురుడు, "ఎందు కమ్మా ఏడుస్తున్నావు?" అని అడిగాడు.



"నాన్నా, నిన్నెవరైనా చంపేస్తారేమో నని భయంగా ఉంది," అన్నది అంగారవతి.

"భయం లేదు, తల్లీ. నాది వజ్రశరీరం. ఏ ఆయుధమూ దాన్ని భేదించలేదు. అదీ గాక నా ప్రాణం నా ఎడమ అరిచేతిలో ఉన్నది. అందులో ఎప్పుడూ విల్లు ఉంటుంది గనక నన్నెవరూ చంపలేరు," అన్నాడు అంగారకుడు. చాటున పొంచి ఉండిన చండమహాసేనుడు అంగారకుడన్న ఈ మాటలు విన్నాడు.

తరవాత అంగారకాసురుడు స్నానం చేసి శివార్చన చెయ్యటానికి కూర్చున్నాడు. ఆ సమయంలో చండమహాసేనుడు విల్లూ, బాణాలూ ధరించి అంగారకుడి కెదురుగా వెళ్ళి నిలబడి, "నాతో యుద్ధానికి రా!" అని అహ్వానించాడు.

అర్చన చేసే వేళ అంగారకుడు మౌనం అవలంబిస్తాడు. అతని కుడి చెయ్యి విడిగా లేని కారణం చేత ఎడమ చెయ్యి ఎత్తి, "కొంచెం ఆగు!" అన్నట్టు సంజ్ఞ చేశాడు. వెంటనే చండమహాసేనుడు బాణం ఎక్కుపెట్టి అంగారకుడి ఎడమ చేతిలో గల ప్రాణ స్థానాన్ని కొట్టాడు.

అంగారకాసురుడు పడిపోయి ప్రాణాలు విడుస్తూ, "నోరు ఎండి ఉన్న సమయంలో నన్ను చంపినవాడు ఏటా నాకు జల తర్పణాలు విడవని పక్షంలో అతని మంత్రులు అయిదుగురు చస్తారు," అన్నాడు.

అంగారకుడు ప్రాణాలు వదిలాక చండమహాసేనుడు అంగారవతిని వెంట బెట్టుకుని ఉజ్జయినికి తిరిగి వచ్చి, అక్కడ ఆమెను యథా విధిగా పెళ్ళాడాడు. అంగారకుడి తుది కోరిక ప్రకారం చండమహాసేనుడూ, ఉజ్జయినీ పౌరులూ ప్రతి ఏడూ ఉదక దాన మహోత్సవం చేస్తూ వచ్చారు. చండమహాసేనుడి అనంతరం ఆయన కొడుకైన గోపాలుడు కూడా ఈ ఉత్సవాన్ని కొనసాగించాడు.





# రాజ్యార్హుడు

పూర్వం మణిశిల రాజ్యాన్ని ఏలిన జగన్మిత్ర మహారాజుకు ఇద్దరు భార్యలు, కాని సంతానం లేదు. ముసలితనం పైన పడుతూండటం చూసి మహారాజు ఒక కుమారుణ్ణి దత్తత చేసుకుని వాడికి రాజ్యాభిషేకం చేద్దామని నిశ్చయించాడు.

ఈ సంగతి తెలియగానే రాజు భార్యలు తమ వైపు బంధువులలో నుంచి చెరొక యువకుణ్ణీ పిలిపించి, తన బంధువునే దత్తత చేసుకోవాలని పట్టుబట్టారు. ఏ భార్య మాటా తీసెయ్యలేక రాజు తన మంత్రిని సలహా అడిగాడు. ఇద్దరు కుర్రవాళ్ళనూ కొంత కాలం దగ్గిర ఉంచుకుని చూస్తే వారిలో ఎవరు యోగ్యుడో తెలిసిపోతుంది అన్నాడు మంత్రి.

తరవాత మంత్రి, పెద్ద రాణి బంధువైన పద్మమిత్రు డనే యువకుడితో, "బాబూ, రాజుగారు ఏనాడైనా మిమ్మల్ని దత్తత చేసుకుని రాజ్యాభిషేకం చెయ్యవచ్చు. రెండు వారాలపాటు రాజ్యమంతా చుట్టి రండి," అని అతని కొక రథమూ, చాలినంత డబ్బూ ఇచ్చి పంపాడు.

పద్మమిత్రుడు పడమటి దిక్కుగా బయలుదేరి కొంత దూరం ప్రయాణించేసి "నల్లబండ" అన్న స్థలానికి వచ్చేసరికి బందిపోటు దొంగ లతన్ని చుట్టుముట్టి పట్టుకున్నారు.

వాళ్ళు అతని దగ్గిర ఉన్న ధనమూ, అతని ఒంటి మీద ఉన్న నగలూ కాజేసి, "ఎవరు నువు? ఎక్కణ్ణించి వస్తున్నావు? ఎక్కడికి పోతున్నావు? నిజం చెప్పు, లేక పోతే చంపేస్తాం," అని బెదిరించారు.

పద్మమిత్రుడు భయపడి, వాళ్ళను మంచి చేసుకుందామనే ఉద్దేశంతో, "నేను మణిశిల రాజ్యానికి కాబోయే రాజును. నన్నిప్పుడు వదిలి పెట్టారంటే రాజు

ఎస్. గోపాలరావు



నయాక మీకు మంచి విలువ గల బహు మానా లిస్తాను," అన్నాడు.

అతడు రాజు కాబోతాడని తెలియగానే దొంగలు అతని మూలంగా చాలా డబ్బు సంపాదించుకోవచ్చునని తెలుసుకున్నారు.

"ఇప్పుడున్న రాజుకు ఒక ఉత్తరం రాయి. నిన్ను దొంగలు పట్టుకున్నారనీ, పదివేల రూపాయలు తెచ్చి నల్లబండ దగ్గిర మా మనిషి కిస్తేగాని నిన్ను వదలరనీ, అదైనా నాలుగు రోజుల లోపల జరగకపోతే నిన్ను చంపేస్తారనీ, డబ్బు తెచ్చే మనిషి నిరాయుధుడుగా రావాలనీ, డబ్బు తీసు కోవటానికి వచ్చేవాణ్ణి పట్టుకోవటానికి ప్రయత్నం జరిగినా నీ ప్రాణాలు దక్కవనీ రాయి," అన్నారు దొంగలు.

అలా పద్మమిత్రుడి చేత ఉత్తరం రాయించి, దొంగలు అతని కళ్ళకు గంతలు కట్టి కొండల మధ్య ఉండే గుహకు అతన్ని తీసుకుపోయారు.

పద్మమిత్రుడు రాసిన ఉత్తరం చదవ గానే రాజు కంగారుపడ్డాడు. డబ్బు కోసం వెనకాడ వద్దనీ, తన బంధువు ప్రాణాలు కాపాడమనీ పెద్దరాణి ఏడిచింది.

ఒక నిరాయుధుడి ద్వారా రాజు నల్ల బండ వద్దకు దొంగ లడిగిన పదివేల రూపా యలూ పంపాడు.

అక్కడ దాని కోసం వేచివున్న దొంగ డబ్బు తీసుకుని, రాజుగారి మనిషిని అక్కడే ఉండమని, తమ గుహకు వెళ్ళి, పద్మమిత్రుడి కళ్ళకు గంతలుకట్టి తీసుకు వచ్చి నల్లబండ దగ్గిర వదిలేసి, తిరిగి అరణ్యంలోకి వెళ్ళిపోయాడు.

పద్మమిత్రుడు రాజభవనానికి తిరిగివచ్చి రాజ్యాన్నీ, దొంగలనూ నానా తిట్లూ తిట్టాడు. జరిగినదంతా విన్నవాళ్ళలో చిన్న రాణి బంధువు పుష్పమిత్రుడూ ఉన్నాడు. అతను పద్మమిత్రుణ్ణి, "దొంగ లుండే గుహకు సైనికులను తీసుకుపోతే వాళ్ళను

హతమార్చవచ్చునే. ఆ పని చెయ్యలేవా? దొంగ లెంత మంది ఉన్నారు?" అని అడిగాడు.

"నన్ను కళ్ళుకట్టి తీసుకుపోయారు. వాళ్ళ గుహ ఎక్కడో, దొంగ లెంతమంది ఉన్నారో ఎట్లా తెలుస్తుంది?" అన్నాడు పద్మమిత్రుడు చిరాకుగా.

"ఈ దొంగలను నేను పడతాను. నాకూడా ఒక రథమూ, కొంత డబ్బూ ఇప్పించండి," అన్నాడు పుష్పమిత్రుడు మంత్రితో.

అతను తాను చేయదలిచిన దంతా మంత్రికి వివరంగా చెప్పాడు.

పుష్పమిత్రుడు రథంలో బయలుదేరి తిన్నగా నల్లబండ వద్దకే వచ్చి అక్కడ రథం ఆపించాడు. వెంటనే అయిదారుగురు దొంగలు అతన్ని చుట్టుముట్టి, "నీ దగ్గిర ఉన్నదంతా ఇచ్చెయ్యి!" అన్నారు.

"నేను డబ్బు తెచ్చిందీ వచ్చిందీ మీ కోసమే. మీకు కొంచెం కూడా బుద్ధిలేదు. రాజు కాబోయేవాడి దగ్గిర అంత కొద్ది డబ్బు పుచ్చుకుంటారా? నన్ను కాదని ముసలి రాజు ఆ పద్మమిత్రుణ్ణి దత్తత చేసు కుంటున్నాడు. పద్మమిత్రుడి ద్వారా మనం లక్షలు సంపాదించవచ్చు. మీ రహస్య స్థలానికి పోదాం పదండి," అన్నాడు పుష్ప



మిత్రుడు. అతను తన రథం తోలే వాడికి, "ఒరే నువ్విక్కడే ఉండి రాజభటు లెవరైనా వస్తున్న జాడ కనిపిస్తే శంఖం ఊదు," అని చెప్పాడు.

దొంగలు పుష్పమిత్రుణ్ణి నమ్మి, అతన్ని తమ గుహకు వెంట బెట్టుకు పోయారు. ముందుగానే తన కర్తవ్యం తెలుసుకుని ఉన్న రథసారథి దొంగలకు కొంచెం వెనకగా వెంబడిస్తూ వాళ్ళ గుహ దాకా వెళ్ళి, దొంగలు పుష్పమిత్రుడితో సహ గుహలోకి ప్రవేశించగానే వెనక్కు తిరిగి వెళ్ళి, తన రథాన్ని అతి వేగంగా నగరానికి తోలుకు పోయాడు.

పుష్పమిత్రుడు దొంగలను అతి సులువుగా తన మాయలో వేసుకున్నాడు.

"ఇంక మీరీ గుహ వదిలిపెట్టి మరొక చోటికి వెళ్ళాలి. ఆ పద్మమిత్రుడు ఉద్దండుడు. కళ్ళకు గంతలు కట్టినా వాడు మీ గుహకు దారి తెలుసుకున్నాడు. ఎన్ని అడుగులు వేసి ఏ దిక్కుగా తిరిగారో, ఎక్కడ ఎక్కారో, ఎక్కడ దిగారో వాడు చక్కగా గుర్తు పెట్టుకున్నాడు. అందుచేత మనం దాగి ఉండటానికి ఇంత కన్న మంచి చోటు చూపిస్తాను. నా వెంట రండి," అన్నాడు.

దొంగలా మాటలు నమ్మారు. వాళ్ళు తమ గుహలో దాచి ఉంచిన ధనం తలా ఒక మూటా నెత్తిన పెట్టుకుని పుష్పమిత్రుడి వెంట బయలుదేరారు. వాళ్ళు కొంత దూరం వచ్చే సరికల్లా రాజభటులు వారిని చుట్టుముట్టారు. ఒక్క దొంగ చేతిలోనూ ఆయుధం లేదు. అందుచేత దొంగలందరూ అవలీలాగా పట్టుబడిపోయారు.

మంత్రి పుష్పమిత్రుడి సామర్థ్యాన్ని మెచ్చుకుని, అతన్నే దత్తత చేసుకోవటం మంచిదని రాజుగారికి చెప్పాడు. రాజు పుష్పమిత్రుణ్ణే దత్తత చేసుకుని అతనికి రాజ్యాభిషేకం చేశాడు.





# యుద్ధకాండ

దుఃఖంతో మతి చెడి ఉన్న రాముడితో విభీషణుడు మరొక విషయం కూడా బయట పెట్టాడు. "నికుంభిలా హోమం చేస్తూండగా మధ్యలో ఎవడు నీతో యుద్ధం చేస్తాడో వాడి చేతిలో నీకు చావున్నది," అని బ్రహ్మ ఇంద్రజిత్తుకు చెప్పాడు. ఇప్పుడా హోమాన్ని భంగ పరచటానికి అవకాశం దొరికింది.

తరవాత రాముడి ఆజ్ఞ పొంది లక్ష్మణుడు సుగ్రీవ హనుమంత విభీషణులనూ, వానర సేననూ వెంట బెట్టుకుని, ఇంద్రజిత్తు హోమ కార్యం భంగం చేసి అతణ్ణి చంప టానికి బయలుదేరాడు. వారి దారికి అడ్డంగా రాక్షస సేన నిలబడి ఉన్నది. ఇంద్రజిత్తు హోమం పూర్తి చేసే లోపలనే ఆ రాక్షస సేనను నిర్మూలించ వలసి ఉంటుందని లక్ష్మణుడితో విభీషణు డన్నాడు. ఆ సేన నిర్మూలమయితే హోమం ముగియకపోయినా ఇంద్రజిత్తు బయలుదేరి వస్తాడు, అప్పుడతన్ని తేలికగా కడతేర్చవచ్చు.

ఈ మాట విని వానరసేన రాక్షససేనపై విరుచుకుపడింది. ఉభయపక్షాలూ దారుణంగా పోరాడాయి. వానరులూ, రాక్షసులూ కూడా పెద్ద సంఖ్యలోనే చచ్చారుగాని, రాక్షసులు వానరుల ముందు నిలవలేక బెదిరిపోయారు.

ఆ వార్త విని ఇంద్రజిత్తు హోమకార్యం పూర్తికాకుండానే లేచి వచ్చి రథమెక్కాడు. రాక్షససేన అతని రథం చుట్టూ మూగింది.



కాని హనుమంతుడు పర్వతాకారం ధరించి, పెద్ద పెద్ద చెట్లతో రాక్షసులను చావ మోద సాగాడు. రాక్షసులు వేల సంఖ్యలో హనుమంతుణ్ణి చుట్టు ముట్టారు. తన మీద రకరకాల ఆయుధాలను ప్రయోగించే ఆ రాక్షసులందరితోనూ హనుమంతుడు ఒకేసారి భయంకరంగా యుద్ధం చేశాడు.

రాక్షసులను అదేపనిగా హనుమంతుడు మట్టుపెట్టుతూ ఉండటం చూసి ఇంద్రజిత్తు తన రథాన్ని అతనికేసి నడిపించాడు. ఇంద్రజిత్తు వేసే బాణాలతో తీవ్రంగా గాయపడి హనుమంతుడు, "దుర్మార్గుడా, నీవు నిజంగా వీరుడవైతే ఆయుధాలు లేకుండా వట్టి చేతులతో నాతో యుద్ధం చెయ్యి," అని అతడి కేసి వెళ్ళాడు.

"ఇంద్రజిత్తు హనుమంతుణ్ణి బాణాలతో చంపెయ్యగలడు. నీవు వెళ్ళి ఇంద్రజిత్తు నెదుర్కొని యుద్ధం చేసి చంపెయ్యి," అని లక్ష్మణుడితో విభీషణు డన్నాడు.

వెంటనే ఇద్దరూ కలిసి నికుంభిల కేసి వెళ్ళారు. అది నల్లని రాక్షసిలాగా కనిపించే జమ్మి చెట్టు కింద ఉన్నది. ఇక్కడే ఇంద్రజిత్తు భూతాలకు బలులిచ్చి, యుద్ధానికి బయలుదేరుతాడు.

"లక్ష్మణా, ఇంద్రజిత్తు జమ్మి చెట్టును ప్రవేశించక ముందే అతన్ని రథాశ్వసారథి సహితంగా నిర్మూలించు," అన్నాడు విభీషణుడు. లక్ష్మణుడు చప్పున జమ్మి చెట్టు మొదలు వద్దకు వెళ్ళి నిలబడి, ఇంద్రజిత్తును తనతో యుద్ధానికి రావలసిందిగా అహ్వానించాడు.

ఇంద్రజిత్తు లక్ష్మణుడితో ఏమీ అనక, విభీషణుడి కేసి తిరిగి, "విభీషణా, నీకు కులాభిమానం లేదు. ఈ గడ్డ మీద పుట్టి పెరిగిన వాడివి నా కెలా ద్రోహం తలపెట్టావు? నీకు బంధుత్వం గాని, మమకారం గాని, ధర్మం గాని లేదు. అయిన వారిని వదిలి శత్రువులకు భృత్యుడ

వయావు! అయిన వారి మధ్య గౌరవంగా ఉండటం కన్న శత్రువుల వద్ద నీచుడుగా ఉండటం నీకు సమ్మతమయింది. నీ బుద్ధి నశించింది. అందుకే నా హోమానికి విఘ్నం కలిగించటానికి లక్ష్మణుణ్ణి ప్రోత్స హించి జమ్మిచెట్టు దగ్గిరికి తీసుకు వచ్చావు. ఇలాటి పని ఇంకెవడూ చెయ్యడు," అన్నాడు.

ఆ మాటలకు విభీషణుడు, "నా సంగతి తెలియనట్టుగా ఎందు కిలా మాట్లాడతావు? నేను రాక్షసుడనై పుట్టానే గాని, నాది రాక్షస స్వభావం కాదు. నేను అధర్మం సహించ లేకనే నా సొంత అన్నను వదిలిపెట్టేశాను. మంచి వాడైనా పాపులను అంటిపెట్టుకుని పాపాత్ముడౌతాడు. దుష్ట సర్పాలను దూరంగా ఉంచాలి. పర ధనాన్నీ, పర స్త్రీలను కోరటమూ, స్నేహితులను నమ్మక పోవటమూ నాశహేతువులు. వాటిమూలంగా నీ తండ్రీ, నీవూ కూడా చావనున్నారు. మాయా సీతను వధించి రామ లక్ష్మణులకు అవమానం కలిగించిన నీవు బతికి ఉండ టానికి తగవు. లక్ష్మణుడి చేతిలో చచ్చి నరకానికి వెళ్ళు," అన్నాడు.

ఇంద్రజిత్తు మహాకోపంతో అస్త్రాలు ధరించి రథ మెక్కి, హనుమంతుడి వీపు



మీద ఉన్న లక్ష్మణుడితో, "రాత్రి యుద్ధంలో నిన్నూ, నీ అన్ననూ, నా బాణా లతో మూర్ఛపోగొట్టాను. అది నీవు మరిచి అయినా ఉండాలి, లేక నీకు చావు దగ్గిర పడి అయినా ఉండాలి," అన్నాడు.

దానికి లక్ష్మణుడు, "ఓరీ రాక్షసుడా? నీవు మమ్మల్ని మాటలతోనే చంపుతున్నావు గాని నిజంగా చంపటం నీ తరం కాదు. కార్యశూరుడు ప్రగల్భాలు పలకడు. నీవు దొంగ లాగా మాకు కనిపించకుండా యుద్ధం చేశావు. అది వీరుడు చేసే పనికాదు. ఇలా ఎదురుగా కనిపిస్తూ నీ ప్రతాపం ఏ పాటిదో చూపు," అన్నాడు.



మరుక్షణమే ఇంద్రజిత్తు అమిత వేగంగా లక్ష్మణుణ్ణి తన తీక్ష్ణమైన బాణాల పరంపరతో కొట్టి సింహనాదం చేశాడు. లక్ష్మణుడు కూడా ఇంద్రజిత్తును క్రూరమైన బాణాలతో కొట్టాడు. ఇద్దరూ సమంగా యుద్ధం సాగించారు.

మధ్యలో విభీషణుడు లక్ష్మణుడితో, "ఇంద్రజిత్తు ధైర్యం సన్నగిల్లుతున్నది. వాడి ముఖంలో వెలవెలపాటు కనిపిస్తున్నది. వీలయినంత త్వరలో వీణ్ణి చంపెయ్యి," అని హెచ్చరించాడు. నిజంగానే లక్ష్మణుడి బాణాలకు ఇంద్రజిత్తు క్షణం పాటు స్పృహ తప్పి, అంతలోనే మళ్ళీ తెప్పిరిల్లాడు. మళ్ళీ ఇద్దరూ యుద్ధం సాగించారు. ఇద్దరూ అమితమైన పట్టుదలతో పోరాడుతూ ఒకరి నొకరు బాగా గాయపరచుకున్నారు.

వారి యుద్ధం చూస్తూంటే విభీషణుడికి కూడా యుద్ధం చెయ్యాలనిపించింది. అతను తన నలుగురు మంత్రులతో సహా రాక్షసులను సంహరించుతూ, వానరులతో, "వానర వీరులారా, ఇంక రావణుడికి మిగిలి ఉన్న వీరుడు ఈ ఇంద్రజిత్తు ఒక్కడే. మిగిలిన వాళ్ళ నందర్నీ మీరే చంపేశారు. వీడు నా అన్న కొడుకు, అందుచేత నా చేత్తో నేను వీణ్ణి చంపలేను. ఆ పని లక్ష్మణుడు చేస్తాడు. ఇంద్రజిత్తుకు అండగా ఉన్న రాక్షసులను మీరు చంపేసి, ఇంద్రజిత్తు చావుకు తోడ్పడండి," అన్నాడు.

వానరవీరులు ఎంతో ఉత్సాహంతో తోకలాడిస్తూ, సింహనాదాలు చేస్తూ రాక్షసుల పైన తలపడ్డారు.

ఈ లోపల లక్ష్మణుడు ఇంద్రజిత్తు సారథిని చంపేశాడు. ఇంద్రజిత్తు తన రథాన్ని తానే నడుపుకుంటూ యుద్ధం సాగించాడు. ఆ సమయంలో నలుగురు వానర వీరులు ఇంద్రజిత్తు యొక్క రథాశ్వాల పైన పడి వాటిని చంపేశారు, అతని రథాన్ని

విరిచి పారేశారు. ఇంద్రజిత్తు నేల పైకి దిగి లక్ష్మణుడితో యుద్ధం సాగించాడు.

అతను తన రాక్షసులతో, "నేను రహస్యంగా నగరంలోకి పోయి ఇంకో రథంతో తిరిగి వస్తాను. నాకు అడ్డంగా నిలబడి మీరు వానరులతో యుద్ధం చేస్తూ ఉండండి. వానరులు నా దారికి అడ్డం రాకుండా చూడండి," అన్నాడు. అతను రాక్షసుల వెనక నుంచి, వానరుల కంట పడకుండా లంకా నగరంలోకి వెళ్ళి పోయాడు. అతను మరొక రథం పైన యుద్ధ భూమికి తిరిగి వచ్చి, లక్ష్మణ విభీషణుల నెదుర్కొన్నాడు. ఎప్పుడు వెళ్ళాడో తెలియకుండా మరొక రథంలో ప్రత్యక్షమైన ఇంద్రజిత్తు ఉపజ్ఞను వాళ్ళిద్దరూ మెచ్చుకున్నారు.

మళ్ళీ ఇంద్రజిత్తూ, లక్ష్మణుడూ యుద్ధం సాగించారు, మరొకసారి లక్ష్మణుడు ఇంద్రజిత్తు సారధిని చంపాడు. కాని రథాశ్వాలు సారధి అవసరం లేకుండానే రథాన్ని నడప వలిసిన విధంగా నడిపాయి. ఇంద్రజిత్తు లక్ష్మణుడితో బాటు విభీషణుడి మీద కూడా బాణాలు వేశాడు. విభీషణుడు మండిపడి తన గదతో ఇంద్రజిత్తు రథాశ్వాలను చంపేశాడు.



ఇంద్రజిత్తు నేల పైకి దూకి, శక్తి తీసుకుని విభీషణుడి పైన విసిరాడు. లక్ష్మణుడు దాన్ని తన బాణాలతోనే పది ముక్కలుగా నరికేశాడు. తరవాత ఇంద్రజిత్తూ, లక్ష్మణుడూ ఒకరి పైన ఒకరు దివ్యాస్త్రాలను ప్రయోగించుకున్నారు. అవి ఒక దాన్నొకటి తాకేసరికి నిప్పు రవ్వలూ, మంటలూ, పొగా బయలుదేరాయి. ఇలా కొంతసేపు ఒకరి అస్త్రాల నొకరు ధ్వంసం చేసుకున్నాక లక్ష్మణుడు ఒక దివ్య బాణంతో ఇంద్రజిత్తు తల నరికేశాడు.

విభీషణుడూ, వానరులూ సింహనాదాలు చేశారు. రాక్షసులు పారిపోయారు.



ఇంద్రజిత్తును చంపేసి వానరులకు మితిలేని ఆనందాన్ని కలిగించి, లక్ష్మణుడు హనుమంతుణ్ణీ, విభీషణుణ్ణీ వెంటబెట్టుకుని సుగ్రీవుడూ, రాముడూ ఉన్న చోటికి వెళ్ళాడు. "ఇంద్రజిత్తు చచ్చాడు," అని లక్ష్మణుడు చెప్పగానే, రాముడు అతన్ని కౌగలించుకుని, "ఇక రావణుడూ చచ్చినవాడే. లక్ష్మణా, నీవు చేసినది చాలా గొప్ప పని!" అన్నాడు.

వైద్యంలో నిపుణుడైన సుషేణుడు వచ్చి, లక్ష్మణ విభీషణులకు గుచ్చుకున్న బాణాలు తీసేసి, చికిత్స చేశాడు. వానరసైనికులు ఉత్సాహంతో గంతులు వేయసాగారు.

దేవేంద్రుణ్ణి సైతం జయించిన ఇంద్రజిత్తు లక్ష్మణుడి చేతిలో చచ్చిపోయాడని వినగానే రావణుడు మూర్ఛపోయాడు. అతను స్పృహ తెలిసి ఇంద్రజిత్తు కోసం చాలాసేపు దుఃఖించి, దుర్భరమైన రోషంతో, "అస్తమానమూ రాముణ్ణే ధ్యానించే సీత బతికి ఉండటం దేనికి? ఇప్పుడే చంపేస్తాను!" అంటూ కత్తి దూసి సీత ఉన్న చోటికి వేగంగా బయలుదేరాడు. అతన్ని మంత్రులూ, భార్యలూ వెంబడించి రాసాగారు. మంత్రులు వారించటానికి యత్నిస్తే రావణుడు వినిపించుకోలేదు.

సీత అతడి రౌద్రాకారాన్ని అంత దూరంలోనే చూసి తనకు చావు మూడిందని భయపడింది.

ఆనాడే హనుమంతుడి వీపు మీద ఎక్కి రాముడి వద్దకు వెళ్ళిపోనందుకు పశ్చాత్తాపపడింది.

చిట్టచివరకు రావణుడికి సుపార్శ్వుడనే మంత్రి అడ్డంపడి, "నీ వంటి బుద్ధిమంతుడు ఆడదాన్ని చంపట మేమిటి? చాతనయితే సీతను వశపరుచుకో. ఈ కోపమంతా రాముడి పైన చూపించు. ఇవాళ కృష్ణ చతుర్దశి. యుద్ధ ప్రయత్నం ప్రారం



ఖించి, రేపు అమావాశ్య నాడు రామలక్ష్మణులతో యుద్ధం చెయ్యి," అన్నాడు. సుపార్శ్వు డన్న మాటలు నచ్చి, రావణుడు ఇంటికి తిరిగి వెళ్ళాడు.

అతను తన సేనాపతులతో, "ఇవాళ మీరంతా వెళ్ళి రాముడితో యుద్ధం చెయ్యండి. అతన్ని మీరు చంపలేకపోయినా, మీతో పోరాడి నీరసించి ఉండే రాముణ్ణి నేను రేపు అవలీలగా చంపుతాను," అని చెప్పాడు.

రాక్షసులు యుద్ధానికి బయలుదేరి వెళ్ళి వానరులపై దారుణ యుద్ధకాండ సాగించే సరికి రాముడు పూనుకుని, వారిని తన బాణాలతో లక్షల సంఖ్యలో అంతమొందించాడు. లంకా నగరంలో చచ్చిన రాక్షసుల భార్యల ఆర్తనాదాలు మిన్ను ముట్టాయి.

ఇంక రావణుడు తానే స్వయంగా రామలక్ష్మణులను చంపటానికి బయలుదేరాడు. అతని వెంట రథాలపై మహాపార్శ్వుడూ, మహోదరుడూ, విరూపాక్షుడూ మొదలైనవారు బయలుదేరారు. అందరూ కలిసి, రామలక్ష్మణు లుండే ఉత్తర ద్వారం కేసి వెళ్ళారు.

రాక్షస సేన యుద్ధసన్నద్ధమై వస్తూండటం తెలిసి వానరులు కూడా యుద్ధానికి సిద్ధంగా



నిలబడ్డారు. రావణుడు తన బాణాలతో వానరులను అపారమైన సంఖ్యలో చంపేస్తూ రాముడున్న చోటికి పోసాగాడు. అది చూసి సుగ్రీవుడు రాక్షస సేనల పైన కొండ రాళ్ళ వర్షం కురిపించి, రాక్షసులను కూడా అపారమైన సంఖ్యలో చంపసాగాడు. అప్పుడు విరూపాక్షుడు రథం మీది నుంచి ఒక ఏనుగు మీదికి మారి సుగ్రీవుడితో పోరాడ వచ్చాడు. సుగ్రీవు డతనితో భయంకరంగా యుద్ధం చేసి మొదట ఏనుగునూ తరవాత విరూపాక్షుణ్ణీ కూడా చంపేశాడు.

తన సైన్యాలు క్షీణించిపోతూ ఉండటం చూసి రావణుడు వానర సేనను నిర్మూ



లించమని మహోదరుణ్ణి ఆజ్ఞాపించాడు. సుగ్రీవుడు మహోదరుడితో కూడా చాలా సేపు యుద్ధం చేసి చివరకతన్ని చంపాడు. వానరులు సింహనాదాలు చేశారు.

ఈ లోపల మహాపార్శ్వుడు అంగదుడి సేన పైకి వెళ్ళి, అంగదుడితో ద్వంద్వ యుద్ధం చేసి, కొంత సేపటికి అతని చేతిలో ప్రాణాలు విడిచాడు.

తన వెంట వచ్చిన ముగ్గురు మంత్రులూ చావటం చూసి రావణుడు మహాకోపంతో రాముడి పైకి వెళ్ళి, యుద్ధం ప్రారంభించాడు. ఇద్దరూ ఒకరిపైన ఒకరు మహాస్త్రాలు ప్రయోగించుకున్నారు; ఒకరి అస్త్రాలను ఒకరు నిర్మూలించారు. చివరకు ఒకరి నొకరు బాణాలతో మర్మ స్థానాలలో కొట్టారు.

రాముడు రావణుణ్ణి తీవ్రంగా గాయపరిచి విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో లక్ష్మణుడు విల్లు ఎక్కుపెట్టి రావణుడి ధ్వజాన్నీ, వింటినీ విరగగొట్టాడు. విభీషణుడు గద తీసుకుని రావణుడి రథాశ్వాలను చంపాడు. రావణుడు రథం నుంచి కిందికి దిగి, తన తమ్ముడైన విభీషణుడి పైన ఒక శక్తిని ప్రయోగించాడు. లక్ష్మణుడా శక్తిని దారిలోనే తన బాణాలతో ఖండించాడు.

అది చూసి రావణుడు మరింత పెద్ద శక్తిని తీసి గిరగిరా తిప్పి, విభీషణుడి పై విసరబోయాడు. లక్ష్మణుడు రావణాసురుణ్ణి తన బాణాలతో పీడిస్తూ అతని ప్రయత్నానికి అంతరాయం కలిగించాడు. రావణుడు మహాకోపంతో ఆ శక్తిని లక్ష్మణుడి పైకే విసిరాడు. అది లక్ష్మణుడి రొమ్ములో లోతుగా దిగబడింది. లక్ష్మణుడు పడిపోయాడు.

రాముడది చూసి భరించరాని ఆగ్రహంతో రావణుడి పైన అతి దారుణమైన బాణాలు వేసి తీవ్రంగా బాధించాడు. రావణుడు రాముడి ధాటికి తట్టుకోలేక పారిపోయాడు.





# రుక్మాంగదుడు

## 3

మోహిని చెప్పినది సరిగానే ఉన్నదనీ, తాను ఏకాదశీ వ్రతం చేసి ఉపవాసం ఉండగూడదనీ బ్రాహ్మలు కూడా అనేసరికి రుక్మాంగదుడికి కోపం వచ్చింది. "హరి హరాదులు వచ్చి ఈ వ్రతం తగదని చెప్పినా నేను మానను. ఏకాదశీ వ్రతం ఆచరించని వాడు నా రాజ్యంలోనే ఉండరాదు. పట్టిన వ్రతాన్ని విడిచిపెట్టటం కక్కిన కూడు తినటంతో సమానం," అన్నాడాయన.

మోహిని ఆగ్రహంతో కళ్ళెర్ర చేసి రుక్మాంగదుడితో, "నా మాటకు అంగీకరించకపోతే ధర్మభ్రష్టుడి వవుతావు. నన్ను పెళ్ళాడినప్పుడు నా కోరిక తీరుస్తానన్నావు. ఇప్పుడు ప్రతిజ్ఞా భంగం చేస్తున్నావు. నిన్ను వదిలేసి నా దారిన నేను పోతాను," అంటూ లేచి బయలుదేరింది. బ్రాహ్మణు లంతా ఆమెతో బాటు బయలుదేరారు.

అదే సమయాన గుర్రం మీద ఎక్కడికో వెళ్ళి వస్తున్న ధర్మాంగదుడు గుర్రం దిగి, ఆమె పాదాలకూ, బ్రాహ్మణుల పాదాలకూ నమస్కారం చేసి, "అమ్మా, ఎక్కడికి పోతున్నావు? ఇంటికి రా!" అన్నాడు.

"నీ తండ్రి ఆడి తప్పాడు. నేను రాను," అన్నది మోహిని.

"నేను జీవించి ఉండగా నా తండ్రి ఇచ్చిన మాట నిలబెట్టుకోలేదన్న మాట రావటానికి వీల్లేదు. నీ మాట చెల్లిస్తాను, వచ్చెయ్యి," అంటూ అతను మోహినితో తన తండ్రి ఉన్న చోటికి వచ్చి, ఆమె కోరిక తీర్చమని బతిమాలుకున్నాడు.

"నేను ఏకాదశీ వ్రతం మానేస్తే మళ్ళీ యమలోకంలో జన సమర్దం పెరుగుతుంది. నా ప్రాణాలైనా ఇస్తాను గాని ఏకాదశీ వ్రతం మానను," అన్నాడు రుక్మాంగదుడు.

అట్ట చివరి బొమ్మ

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఎంత చక్కగ మలిచినారూ !

పంపినవారు :
ఎ. రవూఫ్, కల్లూరు

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఏ ఊరి భామలూ మీరూ ?

పంపినవారు :
ఎ. రవూఫ్, కల్లూరు

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1965 జూన్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎంత చక్కగ మలిచినారూ!

రెండవ ఫోటో : ఏ ఊరి భామలూ మీరూ?

పంపినవారు : అబ్దుల్ రవూఫ్, యు. డి. సి.

కల్లూరు. (ఖమ్మం జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'

మీరు మీ ఊరిలో మా "చందమామ" అమ్మే చిన్న ఏజంటుగా ఉండవచ్చును. దీనికి మీరు మనిఆర్డరు ద్వారా రు. 3-60 పంపిన 8 "చందమామ" కాపీలు మీకు సప్లయి చేస్తాము. లేదా ప్రారంభంలో 4 కాపీలు మాత్రం చాలంటే రు. 1-80 పంపండి. ప్రతి కాపీకి 15 పై. చొప్పున మీకు లాభిస్తుంది. అయితే డబ్బు పంపేముందు మీ ఊరిలో ఇప్పటికే మా ఏజంటు ఎవరూ లేరు అనే విషయం రూఢిచేసుకోండి.

## చందమామ పబ్లికేషన్సు

వడపళని :: మదరాసు-26

# దిలీప్ బృందం

## ఒక విందుకు ఆహ్వానించబడ్డారు





































నిరాల
ఎక్కువ బట్టలను
శుభ్రపరచును



నిరాల
బట్టలను ఎక్కువ
తెల్లగా చేయును



నిరాల
వాటిని తొందరగా
శుభ్రపరచును






